# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

ఆగస్టు 1958

సంపుటము ౩౫ : : సంచిక ౮

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1958

# కరుణాలహరి

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

* గతసంచిక తరవాయి *

మృగముల్ నాగము నావలెన్ భవమునం దెంతేనియుం జిక్కి తా
ముగ చాల్లం బడ, నన్ను మాని మరి యా యన్నింటి విప్పించి నా
వు గదా! నన్నెడిపింప కుండుటది బాబూ! నిదు డెందమ్ముఁ బి
ట్టగలింపం జవదే? యదేమి కత మప్పా! పక్షపాతానకుం?

ఏగతి లేని యార్తులకు నీవ శరణ్యము పాపహారి! యం
చాగమ తత్త్వముల్ దెలుప, నట్టిఁడ వీవని నిశ్చయించి నే
నేగి సమస్త పుణ్యముల హేళనముం బొనరించినాఁడ, నీ
లాగున నంబుజేక్షణ! తలంప వొకింత యదేల చెప్పుమా!

పతితులఁ బ్రోవగాఁగలుగు పావనమూర్తివి నీవయంచు నే
నతతము వేదశాస్త్రములు నత్యెడు ఘోషను బాగవింట, దు
ష్కృతములచే యుపాసనము సేసితి నోవరదా! యశేష దు
ర్గతులకు నీవనద్గతివిగా మదిఁ గట్టిగ నమ్మి శ్రీంతీ!

మునుసుకృతంబులన్ హాఱిపోయియు సేయనలేద యెన్నఁడున్,
విను మఖిలమ్ము దుష్కృతము వేమరు సేసితి, నీదు ముందటన్
గొన నీవు జేమి నల్కవలె కొంకును జంకును ఏడి? సిగ్గు యె
గ్గనునది లేదుగాని యొక యంతయు గర్వము లేదు శ్రీహరీ!

మదమును గామమోహములు మత్సరముల్ బలమెల్లనెత్తి నీ
యెదుటన శత్రువుల్ గదిసి యింతగ నన్నిటు లేడిపింపగా
వదిర! గదారి నందకము లాపయి శార్ఙ్గము చేతఁబట్టియున్
గదలవు సిగ్గు సొందవు కవన్ నను గాదని యుందువేలరా?

గోతనుబద్దబిడ్డఁగని కొండొక దారిని బోవువాఁడునుం
బ్రీతిని జాగుసేయకయ పేరిమితోడుత నుద్ధరించెడిన్,
బ్రాతవు నీవు నోజనక! దారి భవాంబుధి దూకుచున్న యీ
లేత వయస్సువాని గని లీలగఁ జూచుచు నూరకుందువే.

* జగన్నాథ పండితరాయల కృతికి అనుకృతి

వరపుణ్యప్రియ! పుణ్యవంతులకు సర్వశ్రేయముల్ గూర్తువన్
బిరుదల్లుండగనిమ్ము; పాపినగు నన్ వే ప్రోవరావేని యీ
ధర విశ్వంభరుఁడన్న పేర్నిలువ దంగన్ గాచి కావిమ్మిప్పు, ఎ
వ్వరు గాదన్నను నీవు గాదనక నన్ బాలింపు లక్ష్మీప్రియా!

పరుసము లెన్నిరో యకట! పల్కుచునుంటి నటంచు రోసమున్
విరసముఁ బూనకయ్య, యొకవేళ రుషాత్ముఁడవైన దోసమున్
మురహర! కోటికల్మష విమోహితునిన్ మఱి పాపదూరు ని
ర్భర కరుణాబ్ధిలో విసరివైవు, జగద్భరమింక తప్పెడిన్

కృతము గణించి నాకవల నెల్లసుఖమ్ములనుగ్రహింతు వా
శ్రితుఁడను నే గ్రహింపనవి చిన్నము పున్నము సేసియుంచమిన్,
పతితుల నుద్ధరించుట స్వభావము నాకని యేలుదేని శ్రీ
పతి! తలఁదాల్తు నీదయ యవశ్యముఁ దుష్టియుఁ బుష్టిసెందెదన్

పతితుఁడనైన దుఃఖముల పాలగువాడునునైన నెంతొ దు
ర్మతియుఁ గృతఘ్నుఁడే యయిన మంచితనమ్మనుమాట లేకయే
బ్రతికిననైన సిగ్గువడి ప్రాంజలినై భవదీయుఁడన్న న
ప్రతిహత మీశ! నీదయకుఁ బాత్రుడగుగా గద యా యపాత్రుఁడున్!

చతురతఁ బుణ్యమే సలుపు సాధులపైఁ గృపఁ గుమ్మరింతు వా
ప్రతిఫలమేమి నీకటఁ గృపానిధి! యీ ననుబోటివానిపై
సతత కృపాకటాక్షముల బాల్కొనఁజేసిన నాడు నీదు కీ
రితి యది యేమి వేసము ధరించునో నీవ గ్రహింపు మాధవా!

మును పోకనాడు లాలనము పొందిన బిడ్డఁడు తండ్రిచేత నీ
డున, మఱి బుద్ధి నేర్వగ గడుంగడుఁ దాడితుఁడౌటయుక్త, మా
లనయును బాలనన్ దెలియ లాలన నీయెడ నే నెఱుంగ, ప్రా
క్తన నిజ పాపకర్మమునఁ దన్నులు తింట యొకందు దక్కరా!

"భగవన్!" నే బహు దోషదూషితుఁడనై పాపౌఘముల్ ముంగా,
వగలన్ మున్గుచు నేమి తోచక వృథావాగ్ధోరణిన్ దిట్టితిన్
జగతిన్ బాంధుఁడు ప్రేయసీ విరహజ జ్వాలాగ్ని సంతప్తుఁడై
వగతో నయ్యయ్యొ కాంతుఁదిట్టునుగదా! భద్రాను సంధాయకా!

# కరుణాలహరి

ఓ కరుణానిధీ! మిగుల నుద్ధతిమై దహియించె దుర్దశా
వ్యాకులుఁ బాప పంజరుని బట్టుక పీలిచి పిప్పిసేసెన
ప్పా! కను వేదిమో జ్వర మహాకృపామృతసాగరా! నరున్
జేకొని పీడకున్నది యికే! క్షణమేని యిఁకేమి సేయుదున్.

అల్పుఁడనై కటాక్షముల నిరంతర జల్పనముం బొనర్ప నం
కల్పితమౌన నాదుపయి కారుణికోత్తమ! నీకుఁ గ్రోధమ
త్యల్పముగుమో! గణింత్రె కుపితాతుర బాలక భాషితమ్ములం
దెల్ప! మహానుభావులు సుధీ నిధు, లాశ్రిత లోకపాలకా!

ఉరగారాతి సుకేతనా! కనుమమో! యుత్తంభితాశాసము
త్కర ఘోరాహవముల్ జట్టికొంటి, జటిలో దగ్రజ్వరోన్మత్తకుం
జరవజ్రాంకుశ, నన్ మహాజ్వరశిఖాజ్వాలావళీధుర్య నిరా
దరతన్ పీడకు మ్రొక్కుకొందును మహాధన్వంతరీ! శ్రీహరీ!

ఏనన దుష్కృతమ్ములవి యెన్నఁడు సేయన లేదటంచు, నో
దానవ వైరి! పల్కెద యథామతి నొక్క నిజ, మ్మదేమనన్
మానసమందు భీతి ననుమానముఁ బాపె ఖగేంద్రయాన! నీ
ధ్యాన, సుధానిధాన, పతితావన పావన నామగానముల్

శర్వ పితామహాదులును సర్వ సురర్షినిశాచరావళుల్
నిర్వచనమ్ము సేకయు నిన్ బొగడోర్తుఁడంచుఁ గొల్వ నిన్
గర్వ ముఖర్వ మూని యిటు గంటి యుపాలభమానవాక్కులన్
జెర్విడు పీడిపీ! ఖలుఁడు ఛీ! కను ఛీ! యిదె పాడు బుద్ధియున్.

సకలమ్ముల్ విడనాడినాఁడ, మఱి నా సర్వస్వమున్ నీవ, ని
న్నిఁక నే కోరికయేనికోర నిదిగో యీ కొంచె మర్థింతు, ని
ష్కలంకాద్భుత మెల్లయందములకాహా యందమే మూర్తి మా
మక హృన్మందిర గోచరమ్మగుత, శ్రీమందార మాలాధరా!

సశేషం

# హరవిలాసము: దేవదారు వనవిహారము

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథుఁడు బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడు. తత్ప్రసాదలబ్ధ వాణీ ప్రసారయుతుఁ బరమేశ్వరు నారాధించినవాఁడు. సంస్కృత కవులలోఁ గవితా రూపోపహారములఁ బార్వతీ పరమేశ్వరుల నారాధించినవాఁడు కాళిదాసు. అతని యడుగుజాడలలో నడచినవాఁడు శ్రీనాథుఁడు. వివిధ రసభావములను బరమేశ్వరాలంబనముగఁ జిత్రించుటలోఁ బెక్కు విషయములం దిరువురకును సామ్యము గానవచ్చును. శ్రీనాథుఁడు తాను సంతరించిన హరవిలాసమునఁ ద్వితీయ చతుర్థాశ్వాసములందు కుమార సంభవ కావ్యము సరణము గావించుట యిందులకొక నిదర్శనము. కుమార సంభవ కావ్యమునం దష్టమ సర్గలోఁ బార్వతీ పరమేశ్వరాలంబన శృంగార రస భావములు పరాకాష్ఠనందింపఁబడినవి. హరవిలాసమున పార్వతీ పరమేశ్వర వివాహము వఱకు కుమారసంభవమునందలి కథావస్తువు నాదరించి, పిమ్మట శృంగార రస సమగ్రత నాపాదించుటకై శివపురాణమునందలి దేవదారు వనవిహార కథావస్తువు గైకొనినాఁడు శ్రీనాథుఁడు.

పెక్కు కవులు శివుని విలాసములలో దేవదారు వన విహారము ప్రథమముగ గణించి, తదాశ్రయమున శృంగార రసభావములను బరమేశ్వరాలంబనముగ నతిమాత్రము చిత్రించుట యొక పరిపాటి. ఆ ప్రక్రమమునఁ బరమ శివభక్తుఁడైన శ్రీనాథుఁడు దేవదారు వన విహార కథావస్తువును దన హరవిలాస కావ్యోపసంహారకముగఁ గైకొనియు శృంగార రసభావముల నతిమాత్రముగఁ జిత్రింపఁదలఁచియు నౌచిత్యమునకు రసపోషణమునకు సారస్యమునకు భక్తిభావ నిష్కృతికి లోపమేపాటియుఁ గాకుండ నిర్వహించియున్నాఁడు. ఈ దేవదారు వనవిహారము సంస్కృతమున ఉత్ప్రేక్షా వల్లభుఁడను కవి రచించిన భిక్షాటన కావ్యమునందును, తదితర శైవకవుల కృతులందును గానవచ్చును. కాని యా రచనలన్నియు శృంగారరస నిర్వహణమున నుచ్ఛృంఖలములై నడచినవియే. శ్రీనాథునకు సమకాలికుఁడగు నిశ్శంక కొమ్మనామాత్యుఁడు, ఈతని కాశీఖండ కృతి భర్తయగు వీరభద్రారెడ్డి సోదరుఁడు దొడ్డారెడ్డికిఁ గృతిగా నొసఁగిన శివలీలా విలాసము నందును దేవదారు వన విహారమును జిత్రించియే యున్నాఁడు. అదియు శృంగార రస భావావిష్కరణమున నుచ్ఛృంఖలమై కొనసాగినది.

శ్రీనాథుఁ డీయితివృత్తముఁ జేఁబట్టి ఔచిత్యమును సంతరించుకొనుచు రస నిర్వహణమునఁ బ్రతిభానము సంయమనము నలవరించుకొని, శృంగార రసమును భక్తిలో మేళవించి చరమసీమకుఁ గొనిపోయినాఁడు. ఆ విషయము నిట నా యూహకొలఁది వివరింతును. పరమేశ్వరుఁడు పార్వతిని బెండ్లియాడి, మన్మథుని పునరుజ్జీవితుని జేసి, పారిషదగణము తన్ను భజించుచుండ రజత నగమున నిత్య కుటుంబభార సహిష్ణుఁడై సంసారసుఖ మనుభవించుచుండెను. పార్వతి మీఁది వలపుచేఁ ద్రిలోకాధీశ్వరుఁడెపుడు హిమవంతు నింట నిల్లడముండెను. ఏనాఁడైన నత్తవారియింట నిల్లటముండిన యల్లునిపై నత్తవారి కనాదర భావ మేర్పడకమానదు. ఈశ్వరునకునైన నట్టిది తటస్థించెనని తెలుపుదు—

> "అర్థమైఁ గూర్మి యెట్టిరా! యత్తయింట
> నిల్లడంబుండెఁ ద్రిభువనాధీశ్వరుండు."

అనినాఁడు. త్రిలోకాధిపతియైనను భార్యమీఁది వలపుచే నత్తవారింట నిల్లటముండుట యనివార్యమని యింగిత ధ్వనితము.

ఇప్పటి యీశ్వర వేషము శ్వశుర గృహనివాస యోగ్యమా కాన్నలంకార పరిశోభితము. ఇంతకుముందు నాగయజ్ఞోపవీతధారి యిప్పుడు బంగారు జన్నిదములు ధరించుచున్నాఁడు. ఉగ్రుఁడెపుడు గజాసురచర్మము వీడి పట్టుపచ్చడములు దాల్చుచున్నాఁడు. భస్మాంగరాగము విసర్జించి కస్తూరితో మేదించిన శ్రీగంధము లలఁదుచున్నాఁడు. ఎముకల పేరులు వదలి ముత్యాల హారములు ధరించుచున్నాఁడు. జడలపైఁ [illegible] ధరించి బాలచంద్రు నవతంసముగఁ గూర్చుచున్నాఁడు. ఇట్లు చంద్రశేఖరుఁడు పెండ్లికొడుకు

# అంతర్వాహిని

'హితశ్రీ'

రివ్వురివ్వున వీచే గాలుల్లో జనతా ఎక్స్‌ప్రెస్ ముందుకి దూసుకుపోతూ పట్టాలు మారుతోంది. తనకి చేరువగా ఉన్న కిటికీ అద్దం పైకిలాగి విశ్వం తూర్పు దిసగా చూశాడు.

తయార్యారాలు తొలగిపోతూ దవ్వుగవ్వులకి జరిగిపోయే చీకటి తెర చాటున దాంకపుట్టుకుని వెలుగు పరాగాలు చల్లుతుంటే ఆకాశం ముసిముసిగా నవ్వుతోంది!

చైత్ర శుద్ధ పాడ్యమి.

తెల తెలవారుతోంది.

కొత్తగాలులు రివ్వున వీస్తూ విశ్వాన్ని పరామర్శించాయి. ఆ శుభోదయ సుందర దృశ్యాన్ని తదేకంగా చూస్తూ పులకితుడయ్యాడు విశ్వం. వికసించి ప్రసరించే అరుణ కాంతికి కొండల అంచులు గీతలు గీసినట్టు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆకాశమార్గాన పక్షులు స్వేచ్ఛగా కలకల గానం చేస్తూ బారులు బారులుగా సాగిపోతున్నాయి. దూరంలో పసుగపాలు తీరికగా పచ్చిక మేస్తున్నాయి. ఆ పరిసరాలు చూడగానే విశ్వానికి ప్రాణం లేచివచ్చినట్టయింది. ఆ ప్రాంతాలను తనెప్పుడూ సందర్శించలేదు, నిజమే. కాని ఆ చిరపరిచిత దృశ్యాలన్నీ ఏదో అర్థంకాని జ్ఞాపకం చేస్తూంటాయి ఎప్పుడూ. అక్కడ రైలు దిగి ఆ ప్రదేశమంతా కాలినడకన తిరగాలని తనకెన్నోసార్లు అనిపించింది. కాని ఇప్పటివరకూ అది కోరికగానే నిలిచిపోయింది. మనుషుల కోరికలు కొన్ని ఎంత చిన్నవైనా ఎప్పుడూ కోరికలుగానే నిలిచిపోతూంటాయి. సముద్రస్నానం చెయ్యాలని తనకి ఎన్నోసార్లనిపించింది. వాల్తేరులో మూడు సంవత్సరాలు గడిపినా, చివరికి ఆ కోరిక తీర్చుకోకుండానే ఆ ఊరు విడిచి వచ్చేస్తున్నాడు.

రయిమని వీచిన గాలికి ఇంజన్‌లోనుంచి వచ్చిన సన్నని బొగ్గు విశ్వం కంట్లో పడ్డది. తటాలున తల వెనక్కిలాక్కుని చేతి రుమాలుతో ఎలాగో అవస్థపడి దానిని తీసివేశాడు కాని కన్ను ఎర్రబడ్డది. అప్రయత్నంగా ఎదురుగా ఉన్న సీటువైపు చూశాడు విశ్వం. ఆ అమ్మాయి ఇంకా అలాగే తూర్పువైపు నిశ్చలంగా కిటికీలోంచి బయటికి చూస్తూనే ఉంది. తన అవస్థ ఆమె చూసేవుంటుంది. అయినా తల లోపలికి తీసుకోదేం? తన ఉనికి గుర్తించటం ఆమె కేమాత్రం ఇష్టం ఉన్నట్టు లేదు. ఇంతకీ, స్వాభావికమైతే గాని ఏ విషయమైనా మనస్సుకు రుచించదు. అందుకే కాబోలు ఒకప్పుడు నిర్లక్ష్యమూ, ఇంకోసారి అహంకారమూను. పాపం, ఆమె కంట్లో పడితే అవస్థపడుతుంది కాబోలు. ఆడవాళ్లు ఎంతకీ పట్టీకి పైకి దాటు పడరుగాని ఎంత చిన్న ఉపద్రవం జరిగినా ఇట్టే బయటపడిపోతారు. అయినా, ఈ అమ్మాయికి కొంచెం తెగువ ఎక్కువలా ఉంది. రాజమండ్రినుంచీ చూస్తున్నాడు. ఒంటరిగా అర్ధరాత్రి రాజమండ్రిలో ఈ బండి రైలెక్కటం ఆశ్చర్యంగానే ఉంది. ఎవరో స్నేహితులు ఇద్దరు మొగవాళ్లు స్టేషన్‌కి వచ్చి సాగనంపి వెళ్లారు. అప్పటినుంచీ ఆమె మౌనంగా అలాగే తూర్పువైపు ఉంది. ఉత్తర హిందూస్థానీ యువతిలా తలమీద ఆ ముసుగెందుకూ? తన అందం కళ్లతో తాగెయ్యటానికి ఇక్కడెవరో సిద్ధంగా వున్నట్టు!

ఈ అమ్మాయి ఎవరోగాని వేషభాషల్లో నాగరికత ఉట్టిపడుతూ వున్నా కొత్త పూర్వాచారాల ఛాదస్తం వున్నట్టుంది. గోదావరిలో డబ్బులు వేసి దణ్ణం పెట్టింది. తనకి నవ్వొచ్చింది. తను చూస్తున్నాడని సంకోచమైనా ఆమెకి కలగలేదు. ఆ అభిప్రాయం వుంటే ఓ చిన్న దొంగచూపు చూసివుండేది! అన్నట్టు ఆమె రెండుమూడుసార్లు తనవైపు చూసినట్టు అనుమానంగా ఉంది. తన తోలుసంచీ వైపు మాత్రం తప్పకుండా చూసింది. బహుశా దానిమీద తన అడ్రసు వుండి వుంటుందనుకుందేమో! అంత తెలుసుకోవాలని

ఉంటే తనని అడగకూడదూ? పలకరిస్తే నోటిముత్యాలు రాలిపోతాయికాబోలు. ఎక్కడికి వెళుతుందో ఈమె! ఒకవేళ విజయవాడలో దిగిపోతుందేమో!

ఈ ఆలోచనరాగానే మళ్ళీ కిటికీలోంచి బయటికి చూశాడు విశ్వం. జనతా ఎక్స్‌ప్రెస్ విజయవాడ సమీపిస్తోంది. కేవలా ఇంజన్ గావుకేక పెట్టింది తను గుంటూరువద్ద కెళ్ళబండిలోకి మారాలి చేతి గడియారం చూసుకుని, లేచినుంచుని సామాన్లు సర్దుకోసాగాడు విశ్వం తోలుసంచీ తియ్యబోయి అప్రయత్నంగా ఆమెవైపు చూశాడు అతను ఆమె యథాలాపంగా తన సామాన్లవైపు చూసింది ఒక్క క్షణం విశ్వంలో ఏదో బలహీనత తలెత్తి తన అడ్రస్ ఆమెకి కని పించేలా ఆ సంచీ తిప్పాలని అనుకున్నాడు కాని వెంటనే ఆ ఊహకి సిగ్గుపడ్డాడు తనెందుకు ఆమెని గురించి అంతసేపు ఆలోచించాడు? తనెవరు, ఆమె ఎవరు? ఆమెని మళ్ళీ తన జీవితంలో ఎప్పుడూ చూడటం తటస్థించకపోవచ్చు పైగా ఆమె తనకి స్నేహి తురాలేమీకాదు ఆమెతో ఒక్కమాట కూడా మాట్లాడలేదు రాజమండ్రినించి కలిసి ప్రయాణం చేశారు, నిజమే అయినా ఆమెని గురించి ఏ విష యమూ తనకి తెలియదు తనని గురించి ఆమెకి తెలి యదు ఆమె తనని గురించి ఏమైనా అనుకుందో, లేదో! అనుకునే ఉంటుంది తను ఏదేదో అను కున్నాడు ఆమె మాత్రం ఎందుకనుకోకూడదు! చిత్రం, ఇంతసేపు ప్రయాణంచేసే మనుషులో అను కోటాలతోనే విడిపోతున్నారు తనూ, ఆమే తోటి ప్రయాణీకులతో మాట్లాడకుండా దూర ప్రయాణాలు చేసిన రోజులున్నాయి—భాష తెలియనందువల్ల ఆ వ్యక్తి తెలుగువాడైనా, మగవాడైతే తను మాట్లాడకుండా వుండడు కాని 'ఆమె' అయిపోయింది ఆ వ్యక్తి!

ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫారం సమీపిస్తోంది ఆమె ఏమిటో సర్దుకుంటున్నట్టుంది సామాన్లు ఏమీ లేవు. ఒక చిన్న చేతిసంచి మాత్రం ఉంది వెనక్కి తిరిగి చూడాలనిపించింది విశ్వానికి కాని సాహసం చాల లేదు ఒకవేళ అదే సమయంలో ఆమెకూడా తన వైపు చూస్తే!

"టిక్కెట్టు పోయిందండీ"

ఆందోళన వ్యక్తమయ్యే సన్నని స్వరం విని పించింది. విశ్వం గుండె కొట్టుకోవటం స్పష్టంగా విన్నాడు. వెనక్కి తిరిగాడు. కాని ఆమెవైపు చూడ టానికి భిడియపడ్డాడు

"ఎలాగండీ?"

ఏం చెప్పాలో విశ్వానికి తెలియలేదు.

"ఎలాపోయింది!" ప్రయత్నించి అడిగాడు.

"ఏమో చేతి సంచీలో పెట్టుకున్నాను కిందపడి పోయిందేమో!"

విశ్వం చుట్టుపక్కల చూశాడు ఏమీ కని పించలేదు ఆమె గాభరా పడుతోంది అతనికి కొంచెం చిరాకు వేసింది ఆడవాళ్ళు జాగ్రత్త మను షులని తను ఇప్పటిదాకా అనుకున్నాడు

"బయటపడిపోయి ఉంటుంది ఎలాగండీ?" అందామె

"టి సి తో చెప్పండి" అందామనుకున్నాడు కాని జాలివేసింది ఇదికాక తనేమీ చెయ్యలేకపోతే వొట్టి అప్రయోజకుడనుకుంటుందేమో ముక్కూ మొగం ఎరగని మనిషే అయినా ఆమె దానిగురించి అలా అనుకోటం తనకిష్టంలేదు

"పోనీండి, పోయినా ఫరవాలేదు ఇంకో టిక్కెటు తెచ్చిపెడతాను ఎక్కడిదాకా వెళ్ళాలి?" అడిగాడు ధైర్యం చెబుతున్నట్లు

"విజయవాడలో దిగిపోతానండీ" ఆలోచిం చాడు విశ్వం కేమలో ఎక్స్‌ప్రెస్ ఆగింది

"టికెట్ నెంబరు తెలుసా?"

"ఉహూఁ"

ఇంత అజాగ్రత్త మనిషికి పరాకేమిటి? తను ప్పుడూ టికెట్ కొంటాడు గదా, ఇంకెప్పుడూ పారేసు కోలేదు అయినా, టికెట్ కొనగానే నెంబరు చూసి గుర్తుపెట్టుకోటం తనకి అలవాటు

"ఇప్పుడేం చేస్తామండీ?" అనేసి, రైలుదిగి పరుగెత్తాడు విశ్వం గార్డు కనిపించాడు అతనితో చెబుదామనుకున్నాడు విశ్వం కాని ఏం లాభం? ఎక్సెస్ కట్టుకోవాలిసిందే నంటాడు ఆమె దగ్గిం డబ్బుందో, లేదో అబ్బ, సమస్యలు తెచ్చిపెట్టటం ఈ ఆడవాళ్ళకి సైతం నిమగ్గా ప్లాట్‌ఫారం చివరిదాకా ఓ చూపు విసిరాడు విశ్వం దవ్వున అతనిలో ఊహ తట్టింది గబగబ బుకింగ్ ఆఫీసు దగ్గరికి వెళ్ళి ఓ ప్లాట్ ఫారం టికెట్ తీసుకుని వెనక్కి వచ్చాడు. కిటి

పోతే తన వ్యక్తిత్వం సంగతేమిటి? "అబ్బ, మనకు పొట్టి శబ్దది" అని వ్యంగంలో అన్నాడు విశ్వం.

ఇన్‌స్పెక్టర్ గారు కూర్చోగానే బస్సు కదిలి సాగి పోతోంది. గతుకుల్లోనించి పోతున్నప్పుడల్లా ఆ కదుపులకి తూలిపడుతున్నారు జనం. ప్రయాణీకుల్లో చాలామంది చదువుసంధ్యలు లేని పల్లెటూరిజనం. మోటుతనం వేషంలోనే కాక మాటల్లోకూడా ప్రస్ఫుట మౌతోంది. ఎవరో లంకపొగాకు చుట్ట వెలిగించాడు. ఆ పొగ ఘాటుగా విశ్వంమీదికి వొదిలాడు తరవాత బస్సు కిటికీలోంచి తుప్పుక్కున ఉమ్మి వేశాడు. గాలికి ఆ తుంపురులు విశ్వం మొహంమీదికి తగిలాయి. అగ్నిహోత్రుడయాడతను.

"పారెయ్యవయ్యా ఆ చుట్ట"

"ఏంటే?"

"ఆ చుట్ట పారెయ్యమంటున్నాను"

"నీకెట్టయితే పనికొచ్చుద్దా?" అన్నాడు ఆ ఆసామీ కోపంగా. అంత కోపంలోకూడా విశ్వానికి నవ్వొచ్చింది. తను అన్నదేమిటి, అతను అర్థం చేసుకున్నదేమిటి? ఇహ తను ఏమిఅంటే ఏం ప్రయోజనం! మనుషులు ఈ కాలంలోకూడా ఇంత అజ్ఞానంగా ఉంటారని తను అనుకోలేదు విశ్వం. ఏమాట్లాడకపోవటంలో పక్కనఉన్న ఇద్దరు ముగ్గురు కలగచేసుకుని చుట్ట పారెయ్యమని ఆ ఆసామీకిసలహా ఇచ్చారు. అతను ఏమనుకున్నాడోగాని చుట్ట ఆర్పి తలపాగాలో పెట్టుకున్నాడు.

రాచవరం వచ్చిందని కండక్టరు కేకేశాడు. బస్సు బానమండి విముక్తి పొందాలనే తొందరలో విశ్వం బస్సు దిగబోతూ పొరపాటున గేటుపక్కనకూర్చున్న ఓ పడుచుస్త్రీ కాలు తొక్కాడు. వెంటనే "మాపలేదండీ, పొరపాటు" అంటూనే ఉన్నాడు. ఆవిడ తారా మండిపడ్డానికి లేచింది. పక్కవాళ్లుకూడా ఆవిడనే వెనకేసుకొచ్చారు.

"ఆడకూతుర్ని కనపట్టం లేదంటయ్యా?" అన్నాడు ఒకాయన.

"ఓయబ్బో, పట్రకారు పట్రకారా ఈ రోజుల్లో?" అని రిమార్కు చేశాడింకో పెద్దమనిషి.

"ఇది కాలం ప్రభావం గాక ఏవాడో చెప్పారు" అని విచారించాడింకో ఆసామీ.

ఆవిడ నడకయాను స్త్రీ కదుల పరిపోయింది కాని లేకపోతే తనకి ఆ గోలలోనే భూమ్మీద నూకలు తీరిపోయేవే అనిపించింది విశ్వానికి. గోరంతలు కొండంతలుగా చేసే స్వభావం మనుషుల్లో మాన్పలేరేమిటని ఆశ్చర్యం వేసింది అతనికి. ఎలాగో ఆ గొడవనించి తప్పించుకుని రోడ్డుమీద చేతిసంచీతో నిలబడ్డాడు విశ్వం. చెరిగిపోయిన చిన్నబోర్డు కొవపల్లికి దారి చూపిస్తోంది. అక్కడక్కడ చెదురుగా పొలాల్లో మనుషులు కనిపిస్తున్నారు. దూరదూరాన రెండెడ్ల బండ్లు పొలాలకి అడ్డంగా పోతూ ఉన్నాయి. బహుశా గుట్టబండ్లు అయిఉంటాయి. కంకరరోడ్డు దాటి మట్టిరోడ్డుమీదికి వచ్చాడు విశ్వం. దారి విశాలంగానే ఉంది. బండిచక్రాల ఇనపపట్టల చారలు రద్దీగల రస్తాయేనని చాటుతున్నాయి. దారికి రెండుపక్కలా బాగా పెరిగిన వృక్షాలు తీర్చిదిద్దినట్లున్నాయి. వాసంత సమీరం హాయిగా వీస్తోంది. మధుమాసశోభ వెల్లివిరుస్తోంది. అంటుమామిడిచెట్లు పువ్వులతో, చిన్ని చిన్ని పిందెలతో కన్నుల పండువగా కనిపిస్తున్నాయి. అక్కడక్కడ వేపచెట్లు విరబూచి కొమ్మలతో వింజామరలు వీస్తున్నాయి. దూరదూరాన వృక్షాలు రాలిపోయిన ఆకులతో మోడులుగా కన్పిస్తున్నాయి. దగ్గరగా ఉన్న చెట్లు ఎర్రటి కొత్త చిగుళ్లతో వసంతోదయాన్ని చాటుతున్నాయి. ఆ ప్రకృతి సౌందర్య సంపదల మధ్యగా నడుస్తున్న విశ్వం ఏదో అలౌకిక సౌఖ్యం అనుభవిస్తూ తన్ను తాను మర్చిపోయి కొత్త కొత్త అందాలు ఆస్వాదిస్తున్నాడు. బారెడు పొద్దెక్కినా దట్టంగా వ్యాపించిన చెట్లకొమ్మలు, ఆకులు ఎండ సోకనివ్వటంలేదు. ఆకుల సందుల్లోంచి సూర్యకిరణాలు వెలుగుల రవ్వలుగా జారిపడుతున్నాయి. బాటకి ఒకటి రెండు ఫర్లాంగుల దూరంలో కాలవ ప్రవహిస్తోందని ఆ ప్రాంతాల్లో మెమ్మది మెమ్మదిగా బారులుగా ఎగిరే తెల్లటి కొంగలూ, నీటికాకులూ చెప్పకనే చెబుతున్నాయి. కనుచూపు మేర దూరంలో తెరచాప కనిపించి ఆ దృశ్యాన్ని మరింత రమణీయంగా దిద్దుతోంది. కొంచెం దూరంలో ఏరు ప్రవహిస్తోంది. విశ్వం హృదయంలో రసవాహిని పొంగి పొర్లసాగింది. ఎంత కాలం నించో తను వట్టి దృశ్యాలకి అలవాటు పడ్డాడు. మోటారుకార్లూ, బస్సులూ, సైకిళ్లూ

"ఏమిటి మామయ్యా విశేషాలు ?"

వెంకట్రామయ్యగారు తలెత్తి చూసి "కూర్చోరా" అన్నారు.

ఇంతలో పేరమ్మగారు వచ్చి కాదంబరి ఒకటి అందిస్తూ, "ఇదికొంచెం నోట్లో వేసుకో నాయనా" అంది

"ఏమిటత్తయ్యా ఇది ?"

"ఉగాది పచ్చడి."

విశ్వం మాట్లాడకుండా రుచిచూశాడు

"కొత్తసంవత్సరం నీకు బాగా యోగిస్తుంది లేరోయ్" అన్నారు వెంకట్రామయ్యగారు

"మీ అందరికీ కూడా" అన్నాడు విశ్వం

అప్పుడే వొస్తున్న సూరి అందుకున్నాడు "మా కేమిటిలే, నీకు మంచి గిరాకీ తగుల్తుంది సంవత్సరం పొడుగునా సాంఘికసేవ చేస్తూనే ఉంటావులే"

నవ్వాడు విశ్వం

ఏడాదికి తొలిరోజున తొలిఘడియలు సంతృప్తికరంగానే గడిచాయి తనకి ఈ కొత్తసంవత్సరం పాతబడేసరికి తన జీవితంలో ఏ రేం మార్పులు జరుగుతాయో! తీపి, చేదు, వగరు, పులుపుల మిశ్రమమే జీవితం అని ఉగాది పచ్చడి హెచ్చరిక చేసింది. అందులో వేసిన ఆ రోజటి కొత్త ఫలపుష్పాలు జీవితపు కొత్త అనుభవాల సంపుటికి ప్రారంభోత్సవం చేశాయి

## 2

భోజనానంతరం కాసేపు విశ్వాపాటీ మాట్లాడుతుని మంచంమీద వెన్ను వాల్చగానే తనకు తెలియకుండానే కునుకు పట్టింది విశ్వానికి లేచి చూస్తే సూర్యుడు పడమటికి తిరిగి ఉన్నాడు. రిష్టవాచి చూసుకున్నాడతను అప్పుడే నాలుగు దాటింది. అంతా పనులమీద ఉన్నట్టున్నారు. దగ్గర ఎవరూ లేరు. కొంచెం దూరంలో పాలేరు వెంకన్నమాత్రం కొబ్బరి కాయల పీచు తీసే పనిలో నిమగ్నుడై వున్నాడు. అతన్ని చూడగానే విశ్వానికి జాలేసింది పండగపూట కూడా అతనికి పని తప్పదల్లే ఉంది

విశ్వం నిద్ర లేవటం వెంకన్న చూశాడు.

"ఏం బాబూ లేచార ?" పలకరించాడు.

"ఊఁ" అన్నాడు విశ్వం.

వెంకన్న ఓ కొబ్బరి బొండం బయట చూసి చెక్కి రంధ్రం చేసి విశ్వానికిస్తూ అన్నాడు.

"దాహం పుచ్చుకోండి, బాబూ. మా చెడ్డ ఎండగా ఉంది"

విశ్వం అడ్డు చెప్పలేదు

"మన తోటలో కాయేనండి ఇయ్యంటే ఊళ్లోవాళ్లు ఎగబడికొంటారనుకోండి"

మన తోట !

ఇద్దర్నీ కలిపి మాట్లాడుతున్నాడు వెంకన్న నిజానికా తోట ఇద్దరిలో ఎవరిదీ కాదు పాపం, శ్రమ చేసేది తనే కనుక అదొరకమైన తృప్తి పొందుతున్నాడు కాబోలు ఈ దేశంలో శ్రమకి ఫలితం దక్కటం అంత సులభంగా జరిగేదికాదు. సానుభూతి చూపిస్తూ అన్నాడు

"పండగనాడుకూడా పనేనటోయ్, హాయిగా విశ్రాంతి తీసుకోక?"

"పండగైతే పని చేయకూడదా బాబు ? పని చెయ్యకపోతే నాలు వేళ్లు ఇరగొట్టేలుంటది"

"అంత చెయ్యాలని ఉంటే సొంత పనేదైనా చేసుకోకూడదూ?"

"ఇది సొంత పని కాదంటారండీ ?"

అమాయకుడల్లే ఉన్నాడు ఆంధ్రదేశం రాజకీయంగా ఎంతో ముందున్నదని తను అనుకుంటున్నాడు చైతన్యవంతమైన ప్రజ అని గర్వపడేవాడు. కనీస హక్కుల్ని గురించి ఏమీ తెలియనట్టు మాట్లాడతాడేం ఇతను !

"నువ్వు వట్టి అమాయకుడివోయ్"

వెంకన్న చిరునవ్వు నవ్వాడు.

"అయితే ఆ తప్పు ఆసామీగారిదేనండి. వారితోనే చెప్పండి ఆమాట"

నిశ్చేష్టుడయాడు విశ్వం అతనేదో మర్మగర్భితంగా మాట్లాడుతున్నాడు అతనలా అంటాడని తను ఏమాత్రం ఊహించలేదు.

"అంటే ?" అన్నాడు అర్థం కానట్టు తెలియ చేస్తూ.

అప్పుడే అటువైపు వస్తున్న సూరివైపు చూపిస్తూ అన్నాడు వెంకన్న.

"అదుగో చిన్నాయన వస్తున్నాడు అయన్నే అడగండి. ఏంచిన్నయ్యా, నన్ను కచేరీలోంచి వేసింది ఎప్పుడు, నువ్వు చెప్పు"

విశ్వం అప్రతిభుడయ్యాడు. మనుషులు పైకి కన బడేటంత తెలివితక్కువ వాళ్ళు కారు! సూరి నవ్వుతూ అడిగాడు.

"ఏమిటి బావా ఆ సందేహం?"

"ఏం లేదులే"

వెంకన్న వైపు తిరిగి సూరి అన్నాడు

"వెంకన్నా, కడవలో నీళ్ళు పెట్టు బావ ముఖం కడుక్కుంటాడు"

విశ్వం లేచాడు వెంకన్న నీళ్లిచ్చాడు ఆ చల్లటి ఉదకం తగలగానే నిద్రమత్తు పూర్తిగా తొలగిపోయి శరీరంలో కొత్త శక్తి వచ్చింది విశ్వానికి.

జానకి కాఫీ కప్పుతో వరండాలో నిలబడి తట పటాయించటం చూశాడు విశ్వం దగ్గిరికి వచ్చాడు. ఆమె కాఫీ కప్పు బల్లమీద పెట్టి వెళ్లిపోయింది. ఈ కొత్త దనం ఏమిటో అసహజంగా కనిపించింది విశ్వానికి

కాఫీ త్రాగాడు

"ఊరిమీద తిరగటానికి సిద్ధమేనా?" అన్నాడు సూరి

"మామయ్య ఏడీ?"

"ఏదో పనిమీద బజారుకి వెళ్లాడు. అలా తిరి గొద్దాం పద, ఓపిక ఉంటే."

ఇద్దరూ బయల్దేరారు. ఎదురైనవాళ్లు విశ్వం వైపు పరకాయించి చూస్తున్నారు నడుస్తూ ఊరిమధ్యకి ప్రవేశించారు. బోదెచుట్టూ అరుగు కట్టారు దగ్గిరలోనే కిల్లీ దుకాణం లాంటి కొట్టు ఒకటుంది. దానికెదురుగా ఉన్న ఓ చిన్న పెంకుటింటిముందు 'యువజన గ్రంథాలయం' అనే బోర్డు ఉంది మర్రిచెట్టు ఆకుల్లోంచి చూసుకొచ్చిన కర్రలకి ఏవో రాజకీయ పార్టీల జండాలు కట్టుకొని గాలికి ఎగిరేట్టుగా కని పిస్తాయి దూరంలో గుడి గోపురం, ధ్వజస్తంభం కనిపిస్తున్నాయి గుడికి పక్కగా ఉన్న ఖాళీస్థలంలో కొంత మంది కుర్రాళ్ళు ఏవో ఆటలు ఆడుకుంటు న్నారు. ఈ దృశ్యాలన్నీ విశ్వం పరిశీలనగా చూస్తు న్నాడుగాని, సూరి కళ్లు ఎదురుగా రచ్చబండమీద ఉన్న యువకులమీదే ఉన్నాయి వాళ్ళని పరిచయం చేయగానే విశ్వానికి అందర్నీ పరిచయం చేశాడు. వాళ్ళందరికి ఏవేవో కొత్త సంగతులు చెప్పి వాళ్ళలో ఉత్సాహం కలగచేయాలని మొదట విశ్వం అను కున్నాడు కాని కొద్ది నిముషాల సంభాషణ తరవాత వాళ్ళెవరూ తను మాట్లాడేది సరిగా వినటం లేదని విశ్వం గ్రహించి ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. మరికొంతసేపటికి తను అనే ఓ కొత్తవ్యక్తి అక్కడ ఉన్నాడనే విషయమే వాళ్ళు పట్టించుకున్నట్టులేదు తనకి తెలిసొచ్చి పోతోంది లేకపోతే, మన్నాలు కబుర్లు కొంటున్నా గొడవలూ, కుటుంబాల వ్యవహారాల్లో వాళ్ళ కైంకర్యాలూ, బండకు తగాదాలూ మొదలైనవన్నీ తన కెందుకు?

విశ్వం విసుగుదల కనిపెట్టి సూరి లేచి నుంచున్నాడు.

"ఉళ్ళో కబడ్డీ పోటీలుపడి చేసుకుడు అనుకున్నార్ట్, చూద్దాం పదండి" అని హెచ్చరించా డతను మిత్రుల్ని. కొంతమంది నిశ్శబ్దాపడ్డారు. చివరికి ఎక్కువమంది కదలడానికి నిశ్చయించుకుని చెరువుముందు జరుగుతున్న చోటికి వెళ్లారు.

ఆట మంచి జోరుగా ఉంది. సమ ఉజ్జీలు. అటూ ఇటూ పైజనం ప్రోత్సహిస్తున్నారు ఉత్సాహ కేకలూ, ఈలలూ పెరుగుతున్నాయి ఆటగాళ్ళు రాను రాను వల దగ్గిరే కొట్టుకుంటున్నారు. కూతకి వెళ్ళినవాడు పాయింటు ఇవ్వటమో, తేవటమో జరుగు తోందిగాని ఊరికే రావటం లేదు

ఉన్నట్టుండి పెద్ద సందడి లేచింది "ఏమి టేమిటి?" అంటున్నారు కొంతమంది. "ఘోరం, అన్యాయం" అని ఖండిస్తున్నారు మరి కొంతమంది.

"ఏంజరిగిందిరా సూరీ?" ఆదుర్దాగా అడిగాడు విశ్వం

"తలకాయ పగిలింది" అన్నాడు సూరి తాపీగా, అదేం పెద్దవిషయం కానట్టు

జనం మూగుతున్నారు.

"ఎవరిది?"

"ఎవరిదో లే. ఎవరిదైతేమాత్రం నీకేం తెలుస్తుంది."

"అంత దురుసుగా ఆడకపోతే యేం?"

# ఆంగ్లభాషలో భారతీయ పదజాలం

1750 ప్రాంతాలవరకూ కూడా ఆంగ్లేయులు తమ వర్తకంమీదనే బాగా దృష్టి వుంచారు. యుద్ధాల జోలికి బాగా పోలేదు. అందుచేత వ్యాపారానికి కావలసిన మాటలను ఇదివరకే తీసుకుని వుంచెసిందేత వారికి క్రొత్త మాటలు తెచ్చుకోవలసిన అవసరం లేకపోయింది. ఏవో కొద్ది మాటలు "కాట్, బంగళా, కెర్సిమెర్, దస్తుక్" లాంటివి మాత్రమే తీసుకోబడ్డాయి.

అయితే తీసుకోబడ్డ మాటలు విశేషార్థాలతోనూ వేళాకోళాలా హాస్యాలతోనూ, కొన్ని కొన్ని సమయాల మిశ్రమాయింపులలోనూ విశేషంగా వినియోగింపబడ్డాయి ఉదా "బెంగాల్ సిల్క్, మ్యాంగోబర్, పాగోడ్ గాడ్, ఇండియా పెప్పర్, నవాబ్ మేకర్, మహారాటాడిచ్, సిపాయ్, ఛీఫ్, ఇండియా సైన్, నవాబిజమ్, నవాబ్‌షిప్"

కానీ, వ్యాపార పదాలు ఈ శతాబ్దంలో ఎంత తక్కువగా వున్నాయో, రాజకీయ సైనిక పదాలు అంత ఎక్కువయ్యాయి. "సిపాయ్, సిబ్బంది, టెలింగా, రిసాలాహ్, లూటీవాలా, దివానీ" వంటివి ఈ రకానికి చెందినవి. ఈ విధంగా సైనిక పదాలు వృద్ధి కావటం, ఆంగ్లేయులు భారతీయుల మధ్యగల సంబంధాలు ఏ స్థితిలో వున్నాయో విశదీకరిస్తుంది. మొదట్లో ఆంగ్లేయులకు ఆంగ్ల సిపాయీలే ఎక్కువగా వుండేవారు. కానీ చివరకు ఈ ఆంగ్ల సిపాయీలే చిన్నరకంగా జమీందారుల్లాగా సంచరించడంతో సుబేదార్లతో, హవల్దార్లతో, జమేదార్లతో, నాయక్‌లతో భారతీయ దళాలు ఏర్పడ్డాయి. ఈ శతాబ్దంలోనే విచిత్రమైన క్రొత్త పదాలు రెండు జనించాయి. 1 బ్లాక్ హోల్, 2 బ్లాక్ హోల్ ఆఫ్ కలకటా కథ అబద్ధమైనా ఆ పదం ఎంత సంచలనాన్ని, దుమారాన్ని కల్గించవలెనో అంతటిని కల్గించింది. జనానాలో ఘోషా స్త్రీల ఆనందం నిమిత్తమై "నాచ్" ప్రవేశపెట్టబడింది. ఇటువంటి జాతికి చెందిన పదాలే "చిలుం, హుక్కా, ఖేదా"లు.

## 1800 నుండి 1900 వరకు

ఈ శతాబ్దంలో పదాల ఎగుమతి దిగుమతుల వ్యాపారం బాగా ఎక్కువైంది. క్రిందటి శతాబ్దం కన్నా, కొంత తొందరగా మాటలకు మాటలు పుట్టి కాకుండా పరాపరి సంస్కృతంనుంచే అవి వృద్ధి అయినాయి. ఈ శతాబ్దంలోనే మొట్టమొదటి సారిగా "ఇండో-యూరోపియన్" అన్న శబ్దం వినబడింది. ఈ శతాబ్దంలో మరొక్క విశేషం ఏమిటంటే, గతంలోలాగా కాకుండా, పరాపరి సంస్కృతంనుంచే అనేక పదాలు గ్రహించబడ్డాయి. "ఉదా సంధి, గుణ, స్వరభక్తి, దేవనాగరి" ఇత్యాది. ఇంత వరకూ భాషా విజ్ఞానానికి చెందిన పదజాలమే విశేషంగా ఆంగ్లంలోకి తీసుకోబడింది. కాని ఈ శతాబ్దంలో భారతీయ వేదాంతశాస్త్రం నుంచి ప్రాముఖ్యాన్ని సంపాయించుకొంది. భారతీయసంస్కృతి, వాఙ్మయం, హిందూమతం తదితర పదజాలాన్ని ఆంగ్లానికి దత్తత చేసినవి "బ్రాహ్మణ" అన్న శబ్దానికి ఉచ్చేల సంతతి కలిగింది "ఉదా: బ్రాహ్మణిక్ ఫిలాసఫీ, బ్రాహ్మనికల్, బ్రాహ్మణి-బిగ్-బ్ర

18వ శతాబ్దం చివరి భాగంలో "వేద, రిగ్వేద, అవతార్, గురు, తంత్ర," లాంటి పదాలు, 19వ శతాబ్దంలో "యుగ, అమృత, భక్తి, స్తూప, బుద్ధిజం, కర్మ, దేవ, మహాత్మ, మేళా, పూజా, సంహిత, సంస్కార, ఉపనిషత్, విమాన" లాంటి పదాలు ఆంగ్లానికి బలాన్ని చేకూర్చాయి. ఇట్లా చేరి, తమ భావపుష్టి కలించడాన్ని ఓవెన్ బార్ఫీల్డ్ మున్నగు వారెందరో సమర్థించారు అయినా "కర్మ, ధర్మ, మాయ" ఇత్యాదికి ఆంగ్లంలో సరియైన అర్థాన్నిచ్చే మరో పదాలేవీ వారు సమర్థించవ మొక వింత కాదు

ఇంక సిపాయీలయుద్ధం, ఆఫ్ఘన్‌యుద్ధం సిపాయి తిరుగుబాట్లు మరికొన్ని పదాలను చేర్చినవి ఇంగ్లీషులోకి ఉదా: "పుక్రి, జెజైల్, పాంసి, చుప్పట్, లోటా, ఘంటీగార్" వంటివి ఆదీగాక పైతరగతికి చెందిన పదాలు—బంగీ, పచీసి, తమాషా, బంగాయస్ హూలాబూక్, టూన్—అనేకం.

## ఇరవయ్యో శతాబ్దం

ఈ శతాబ్దంలో, ముఖ్యంగా భారతస్వాతంత్ర్య సమరం, ఇంగ్లీషులో మన పదాలు చేరడానికి చాలా వరకు దోహదం చేసింది. ప్రథమ ద్వితీయ ప్రపంచ సంగ్రామాలు "అర్ఖ్‌స్లాంగ్" ఏర్పడడానికి కారణమయ్యాయి "బొకాటీ, దర్, చలో, అచ్ఛంగ్,

"బెంగాలా, మద్రాస్, మలబార్, ఆగ్రా, లాహోర్, గంగెస్, ఇండస్, హైడాస్పస్ (జీలం నది)"[1] మొదలైన పేర్లు ఉపయోగించాడు.

ఇంక 'ఇండియన్' అన్న పదాన్ని మొట్టమొదటసారిగా ఉపయోగించే గౌరవం డ్రైడన్‌కు దక్కింది 1 అంతేగాక అతను ఔరంగజేబుతో వ్రాసిన నాటక మొకటి వుండనే వుంది

18వ శతాబ్దంలో, తిరువాన్కూర్‌లో పుట్టి, తన యౌవన ప్రథమార్థంలో ఇక్కడ ఉద్యోగం చేసిన రాబర్ట్ ఆర్మ్, ఎడ్మండ్ బర్క్ ఇద్దరూ ఎంతగానో భారతీయ పదజాలాన్నాదరించారు ఒకరు ఈ దేశ వాసులతో కలిసి మెలిసి ఇక్కడి భాషా సౌందర్యాన్ని ప్రశంసిస్తే, మరొకరు అదేమీ లేకుండానే, విదేశంలో వుండికూడా దక్కటి విమర్శనా జ్ఞానంతో, తప్పటడుగు వేయకుండా భారతీయ పదాలమీద స్వారీచేశాడు

డేనియల్ డీఫో ఫాక్స్, వాల్పోల్, స్మాలెట్ మొదలయిన వారంతా ఎక్కడో అక్కడ ఏదో ఒక సందర్భంలో భారతీయ పదాన్ని వాడేవున్నారు

పద్దెనిమిదవ శతాబ్దం చివరి భాగానికల్లా మహాపండితులైన "సర్ ఛార్లెస్ విల్కిన్స్, నథానియల్ హాల్ హెడ్, అలెగ్జాండర్ డౌ, సర్ విలియం జోన్స్, అలెగ్జాండర్ హామిల్టన్" ప్రభృతులంతా ఇండియన్ వ్యవహారాలమీద పుస్తకాలు రాసి, భారతీయ భాషల నాదరించి, అంటి పదాలతో తమ సాహిత్యాన్ని కలిపుకొన్నారు ఏ తప్పూ లేకుండా వాడారు

ఇక పందొమ్మిదవ శతాబ్దంలో నవలా రచయితలూ, విమర్శకులూ, కవులూ, చరిత్రకారులూ, యాత్రికులంతా భారతీయ భాషల సౌష్ఠవాన్ని గుర్తించి, ఆయా పదాలను వాడుకొన్నారు

స్కాట్, సౌథే, బైరన్, మెకాలే, థాకరే, కిప్లింగ్, సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్, సర్ జి ఓ, ట్రెవెల్యన్, జేన్ ఆస్టిన్, టి యస్ ఎలియట్ ఇలా ఎంతమందినైనా చెప్పవచ్చు వారు వాడిన పదాల జాబితాలనుండి "బనియన్ టీ, అమృత, దినా, హిందూస్తానీ, థగ్, పటేల్, పంకా, ఫకీర్"లాంటి వాటి నెన్నైనా చూపించవచ్చు

2సర్ వాల్టర్ స్కాట్ భారతదేశాన్ని గూర్చిన మొట్టమొదటి నవల వ్రాశాడు సథే హిందూ స్త్రీలనూ, దేవతలనూ తన కావ్యాల్లో చిత్రించాడు 3

కానీ కిప్లింగ్‌లాంటివారు హిందూదేశంమీది అభిమానంతో తమ తమ గ్రంథాల్లో వాడిన మాటలన్నీ కూడా సర్వజనులకూ అవగాహనయోగ్యం కాలేదు. చాలా మాటలు "బాలఖా, ఖైదీ, సాహిబా, జల్దీ, జాదూ" వంటివి వచ్చిపోయాయి

అయితే ఇరవయ్యో శతాబ్దంలో ఒక విచిత్రమైన పరిస్థితి వచ్చిపడింది. ఆంగ్లేయులు మనదేశాన్ని గూర్చి, మన జీవనాన్ని గూర్చి కథావస్తువులు తీసుకుని ఆంగ్లంలో రచనలు చేయడానికి బదులు, భారతీయులే రవీంద్రులు చూపిన బాటలో, భారతీయ జీవితాన్ని యథాతథంగా చిత్రిస్తూ రచనలు సాగిస్తున్నారు

ప్రముఖ నవలారచయితలైన శ్రీ కె ఎ అబ్బాస్, డా ముల్క్ రాజ్ ఆనంద్, శ్రీ ఆర్ కె నారాయణ్ లాంటివారు చేస్తున్న కృషివలన ఆంగ్లానికి ఒక క్రొత్త జీవం వస్తున్నది అంతేగాక ఈ పత్రికల యుగంలో పత్రికా రచయితలు వహిస్తున్న పాత్ర మరీ ముఖ్యమైంది కావటంతో, ప్రముఖ పత్రికా రచయితలయిన శ్రీ కుందూరి ఈశ్వరదత్తు మొదలయినవారి ఉద్యమాలతో భారతదేశం ఆంగ్ల భాష అనే అద్దంలో తనను తాను సగర్వంగా చూచుకొంటున్నది

ఇదే పదికాలాలపాటు వర్ధిల్లాలి రాజకీయంగా దేశపరిస్థితి ఎట్లున్నా భాషల సంపర్కంలోనే, ఒక క్రొత్త చైతన్యం పొంగులు వారుతుంది అప్పుడే అటు ఆంగ్లమూ, ఇటు భారతదేశ భాషలూ వర్ధిల్లేది! తథాస్తు *

---

1 Marriage ala Mode IV 304

2 The Surgeon's Daughter

3 The Curse of Kehama

* ఈ నా వ్యాసరచనలో శ్రీ జి. సుబ్బారావుగారి Indian Word in English అన్న గ్రంథము చాలావరకూ తోడ్పడింది. ఇందుకు వారికి నా కృతజ్ఞతలు ఇంకా తోడ్పడిన గ్రంథాలు ఇవి

1 A Dictionary of American English on Historical principles

2 Daniel Jones' An English pronouncing Dictionary

3 H H Wilson A glossary of judicial and revenue terms and of useful words occurring in official documents relating to the administration of the Govt of British India.

ఇప్పుడు మూరాన డబ్బుకోసం గడ్డితిని, మీరీ
సంబంధాలు చూస్తున్నాడు దీనికి పిల్లవాడి
అభిప్రాయమ్ముద ఏమాత్రం లేదు వాడెప్పటికీ నా
అల్లుడే! కాని నరోత్తమా, మీరు వచ్చిన
దారినే దయచెయ్యండని చెబుతున్నాను.

పేర మరి (ఏదో చెప్పబోతాడు)

నారా: (సీరియస్ గా) మరీ లేదు గిరీ లేదు వచ్చినం
దుకు కుష్టగా ఫోం చేసి బండెక్కండి లేదా..
(పళ్లు బిగించి పిడికిలి చూపుతాడు.)

పేర (కంగుతిని) అలా కానండి

నారా (లోపలికి రెండడుగులు వేసి, వెనక్కి తిరిగి)
పేరయ్యగారూ!

పేర అయ్యా!

నారా మీరు ఫోంచేసేవరకే జట్కా వచ్చి వాకిట్లో
వుంటుంది మీరు మా బావతో ఈ గొడవేమీ
చెప్పకుండా ఏం తెలిసిందా? (గద్దిస్తాడు)

పేర • చిత్తం. విపులంగానే చెబుతున్నానుగా! తప్ప
కుండా ఎక్కుతాను.

నారా: (దగ్గరగా వచ్చి) మా బావతో ఈ విషయం
చెప్పారో మీకు మరి తెవాలితేర ఆకే
వుంటాను

పేర (భయపడుతూ) చి. చిత్తం అంతవరకూ
అక్కర్లేదండి (లోపలనుండి నాంచారమ్మ
కంఠం వినిపిస్తుంది)

నాంచా అదీ చూస్తా నా కంఠంలో ఊపిరుండగా
ఆ ఇచ్చేవాడెవ్వడో చూస్తాడో, చేసుకొనేవా
డెలా చేసుకొంటాడో

రాము (లోపలనుండి) ఇదుగో నాంచారమ్మతల్లీ!
నీకు పుణ్యముంటుంది గాని, పరాయి పెద్దమనిషి
ముందు నా పరువు తీయబోకు

నాంచా (విసురుగా) ఎవరైతే నాకేం భయమా? ఆ
పెద్దమనిషినే అడుగుతాను, ఇది న్యాయ
మేనేమో?

పేర (నారాయణయ్య వంక చూచి, ఆ గొడవేమిటని
సైగ చేస్తాడు

నార: పిల్లవాడి మేనత్త. ముందు నిన్ను పంపించేసే
తర్వాత ఆ విషయం చూసుకొంటాను. మీరు
మాత్రం ప్రయాణసన్నాహంలో వుండండి.
(బయటకు వెళ్ళిపోతాడు)

పేర నామ్మయ్య! (కుర్చీలో చతికిలబడతాడు)

నాంచా: (మొగ్గపులా వచ్చి) ఇదుగో ఏమయ్యా పెద్ద
మనిషీ! నువ్వేం ఆ పిల్లల్ని కనుక్కోలా?
నీ పిల్లలాంటిదిగాదూ నా పిల్లమాత్రం?
నీకేమయినా జ్ఞానముంటే, మేనరిక
ముండగా పిల్లనిస్తారని వచ్చావా?

పేర (ఇంతసేపూ నాపెటపోతుంటాడు కొంచెం తేరు
కొని) ఇదుగో తల్లీ! భరానిస్తే!

నాంచా: నా పేరు నాంచారమ్మ.

పేర ఏ అనాచారమ్మయితే నాకేంగాని, మా గొడవ
లేమీ నాకు తెలియవు నా బుద్ధి గడ్డితిని ఇక్క
డకు వచ్చాను. వచ్చినందుకు బాగా నాకే జరి
గింది. దయచేసి ఏమ్మీమీ అనకండి తల్లీ! నే
నిప్పుడే వెళ్ళిపోతున్నాను.

నాంచా: వుంటానంటేమాత్రం వుండనిచ్చేదనకే!
(లోపలకు చూస్తూ) ఒరేయ్ ఏసుకొండయ్యా!

ఏసు (లోపల్నుండి) ఓయ్ వస్తున్నా. (వచ్చి) ఏం
టమ్మగోరూ?

నాంచా లోపల పేరయ్యగారి సంచి వుందిగా, దాన్ని
తెచ్చి వారికివ్వు

ఏసు దరికు మూగనుకుంటార బాబూ?

నాంచా ఏదో ఒకటి తెలచెప్తారే, నీకెందుకు? తెచ్చివ్వు

ఏసు (పేరయ్యతో) ముందు తానం చెయ్యండి

పేర (ఏదో చెప్పబోతాడు కాని, నాంచారమ్మ
వంక చూచి ఆగిపోతాడు)

నాంచా తెచ్చివ్వగ అంటుంటే (గదమాయిస్తుంది)

ఏసు సిత్తం (అయిష్టంగా లోపలికెళతాడు.)

పేర: (కొంత సవరించుకొని) ఇదుగో కనకదుర్గమ్మ
గారూ!

నాంచా: నా పేరు నాంచారమ్మయ్యా బాబూ!

పేర: ఏదయితేనేంలెండి కాని ఒక్కమాట.

నాంచా: ఏమిటది?

పేర: నేను వెళ్ళిపోవటం ఎలాగూ ఖాయమైపోయింది
కాని.

నాంచా: కాని?

# ఉపగూహనము

శ్రీ శివశంకరశాస్త్రి

## పూర్వార్థము

౧

ఎవరో యొక చోటుకాదు
ఇటీవలను జెప్పినట్టి
గాథ ననుసరించి యల్లు
కథన కావ్య మీ రచనము.

సత్యమైన, కాకున్నను
సంఘటనలు విన్నవారి
పెదవులపై దరహాసం
బుదయించుటయే తథ్యము.

సంఘటనం బాదియందు
సరసముగా సాగె, కాని
మధ్యమార్గమందు మిగుల
మందముగా నడచుచుండె.

వివిధగతుల రాగగాథ
విచిత్రముగ నొక్కనాడు
పరిణయోత్సవమ్ములోన
పరిసమాప్తి నొందెనంట!

౨

మంథానాగ్రహారమందు
మహీసురుల వంశమందు
పుట్టినాడు యోగ్యుడైన
పురుషోత్తమశర్మాఖ్యుడు

ఆంగ్లవిద్యతో పాటుగ
అధ్యయనము చేసినాడు
తండ్రికడన కొంత కొంత
తైత్తిరీయసంహితలో.

వేదములో వర్ణితమౌ
వివిధదేవతాకృతులను
చిన్ననాటనుండి యతడు
చేయుచుండు మృత్తుతోడ.

పాఠశాలలోని విద్య
పరిసమాప్తి నొంది నంత
అవల నేమి చేయవలయు
నన్న చర్చ సాగెనచ్చొ.

అంతలోన తండ్రి పోయె
అమ్మ చిన్ననాడె చనియె.
మిగిలె బంధువర్గమందు
మేనమామ యొక్క డతనికి.

మంథనలో పెంకుటిల్లు
మంచి పంటభూమియు గల
వతనికి, లేదేమాత్ర
మ్మార్థికమ్ముగా లోపము

అగ్రహారమందు కలరు
అయిదుమూర్ల పట్టభద్రు
లందుచేత మేనమామ
ఆ చదువే చదువు మనియె.

అతడు పట్టభద్రుడైన
ఆత్మజాత నిచ్చి పెండ్లి
వైభవమ్ముతోడ చేయ
వచ్చు ననుచు మామకోర్కె.

3

మేనమామ కూతురైన
మీనాక్షీదేవి కూడ

# ఉపగూహనము

శర్మ కిశదలోన చెప్ప
శక్యముకానట్టి ప్రీతి.

అనుదినమ్ము వీక్షించెడి
యభ్యాసమువలన ప్రీతి
కలిసిపోయె మానసములు
క్రమముగా నుభయులకును.

చనవువలన నడుమనడుమ
చమత్కారవాక్కు లాడి
గాఢముగా ముద్దులాడు
కుమారి చెక్కిళ్ళ సతము.

ఎదురుగా నరుగుదెంచు
నేని మేనమామకూతు
రుల్లాసముతో నలతిగ
నుపగూహన మాచరించు.

పిన్నవారి రాగసరణి
పెద్దల కభిమతమె కాన
పరిణయమ్ము నిశ్చయ మని
భావించిరి బంధుజనులు.

ఆమె జనని వాంఛితంబు
ఆయేడే పెండ్లి చేయ
మేనల్లుని చదువు ముగియు
మీద చేయ తండ్రి తలపు

౪

పంపినాడు మేనమామ
భాగ్యనగర కలాశాల
లోన జేరి చదువు మనుచు
మేనల్లుని మంచినాడు.

అచటి కలాశాలలందు
అలభ్యమైపోయె తావు
చిత్రకళాశాలలోన
చేరినాడు తుదకు శర్మ

శక్తికొంత, ప్రీతికొంత
స్వతస్సిద్ధముగనె యుండు
కారణమున శిల్పకళను
కడువడిగా నేర్వ కలిగె.

అచటి యొజ్జలెల్ల సిద్ధ
హస్తులైనవార లగుటజేసి
సహాధ్యాయులైనవారు
శ్రద్ధధాను లగుటవలన—

చిత్రకళాశాలలోని
జీవిత మాతనికి మిగుల
ఉద్బోధక ముత్తేజక
ముల్లాస ప్రదము నయ్యె

చలికాలపు సెలవులలో
స్వగ్రామము చేరువరకు
ఈ విద్యాభ్యాసచరిత
మెవ్వరికిని తెలుప డతడు

నిజము తెలిసి మేనమామ
నివ్వెరపా టొంది యపుడు
కొంతవడికి తెప్పరిల్లి
కోపముతో ననియె నిట్లు

"కులీనోర్వీ సురుడ వీవు
కులాలుండ వయినావా!
భావికాలమందు రాతి
పనివాడవు కానుంటివ!

ఉన్నయెడల నీ తండ్రియె
ఒప్పునొకో దీనికి? నీ
విద్యావిషయములో నిక
విడిచినాను నా బాధ్యత!"

విరసవాక్యములకు శర్మ
విమనస్కుం డగుచు పోయి

గోదావరీతీరంబున
కొంతతడవు విశ్రమించె—
కాంచి శిథిల విగ్రహములు
గౌతమేశ్వరాలయమున
స్వామి దర్శనమ్ము చేసి
సదనమునకు జేరినాడు.

"ఇంత ప్రొద్దుపోవు వరకు
ఎచట తిరిగినావు బావ?
అటులున్నా వేందుల?" కని
ఆదరముగ నడిగె కన్య.

"మీ నాయన యే మనెనో
మీనా, విన్నావు కదా
చెప్పుము నీవైన నిజము,
శిల్పవిద్య దూష్యంబా?"—

ఆ మాటల కర్థోక్తిని
అనునయసుస్వరముతోడ
"తనకు నచ్చు కార్యము నే
తత్పరతం జేయదగును.

"నన్నుమాట కేమి కాని
నా ప్రతిమను చేయుదువా?
మిగుల ప్రీతి శిల్ప" మనుచు
మీనాక్షీదేవి పలికె.

బాలపలుకు నమాయికపు
భాషణముల తెప్పరిల్లి
చిరునగవున శర్మ యామె
చెక్కిళులను ముద్దాడెను.

౫

మేనమామ, మేనత్తయు
మీనాక్షీదేవి కూడ
వారించుచు నున్న వినక
స్వగ్రామము విడిచె నతడు.

నిజకళ పురుషోత్తముండు
నిష్ఠతోడ నభ్యాసము
చేయుచు న్క్రమముగాను
సిద్ధహస్తు డగుచుండెను.

భారతీయ శిల్ప చరిత
పౌరాణికగాథావళి
పాశ్చాత్యకలాచరిత్ర
పఠియించుచునుండె నతడు.

చేతినిండ ధన ముండుట
చేత ప్రసిద్ధాలయములు
కళాక్షేత్ర దర్శనమ్ము
కావించును సెలవులలో

చిత్రలోకవిహారణంబు
చేయు నతని కప్పుడపుడు
మీనాక్షీదేవి రూపు
మెలగుచుండు స్మృతిపథమున.

౬

అచట మంథనాగ్రహార
మందు తల్లి తమ తనూజ
పరిణయోత్సవమ్ముగూర్చి
భర్తను త్వరపెట్టుచుండె.

"అన్వేషణ చేయుచున్న
ననుగుబిడ్డ పెండ్లికొరకు
యోగ్యుడైన వరుం డిచట
ఒకడు కూడ కానరాడు."

"మేనల్లుడు చెంతనుండ
మీనాక్షికి వేరే వరు
డెందులకో? మీ వాక్కులు
ఎప్పుడు చిత్రముగ నుండు!"

అనెడి భార్యభాషణముల
కడ్డు వచ్చి భర్త యనియె :

"బొమ్మలు చేసెడివానికి
పుత్రిక నెట్లీయగలను!"

"ఇదియా మీ సందేహం,
ఇంకేమో యనుకొంటిని.
పురుషోత్తమశర్మ కేమి
శీలోపము, ధనలోపము?

చేయవచ్చు సంపాదన
శిల్పకలామూలమ్మున
మంచిపేరు వచ్చు ననుచు
మన మీనాక్షమ్మ మతము."

ఇట్లు భార్య ప్రతివచనం
బిచ్చినంత, యజమానుడు
ఏమి యనక శిరసు మాత్ర
మిట్టటు కదలించినాడు.

౮

పెట్టెలతో బుట్టలతో
పెద్దపెద్ద యట్టలతో
స్వగ్రామమునందు దిగుచు
స్వగృహమ్ము చేరె శర్మ.

పరిసమాప్తి చేసి విద్య
భాగ్యనగర కలాశాల
విడిచి వచ్చి మంథెనలో
విశ్రమింప దలచినాడు.

ఎనిమిదేండ్ల నారాయణ
ఎగురుచు నుల్లాసమునను
అమ్మ, బావ వచ్చినాడె
అనుచు తల్లితోడ జెప్పె.

"నాకు చేయితీర లేదు—
నారాయణ, మీనాక్షీ,
బావను పిలుచుకు రండని
పంపె జనని ప్రీతితోడ.

తెచ్చుకొన్న వస్తుచయము
తీర్చిదిద్ది, వారి వెంట
ప్రక్క వీథిలోని మామ
భవంతికిం జేరె శర్మ.

మేనత్తకు పట్టుచీర
మీనాక్షికి నారాయణ
కెన్నెన్నో వస్తువులను
ఏర్పరించి యిచ్చినాడు.

కుశలాదిక మడుగు వెనుక,
గోదావరి కేగి వత్తు
అట్టె ప్రొద్దుపోవకుండ
నని పురుషోత్తము డరిగెను.

భోజనార్థ మతని బిలువ
బోయినపుడు రాత్రి కన్య,
"ఉండుండుము మీనాక్షీ,
ఒక్కదాని మరిచినాను"—

అని యతండు పెటి తెరచి
అందలి ముత్తెముల దండ
దీసి యామె కంఠంబున
వేసి యప్రయత్నముగా—

వెనుకకు రెండడుగు లేసి
వీక్షించుచు నామె మోము
చిరునగవున ముందు కరిగి
చెక్కిలి ముద్దాడినాడు.

"పెద్దదాన నయినా" నని
పిల్ల పలుక లజ్జతోడ,
ఉల్లాసముతో నతండు
ఉపగూహన మొనరించెను.

౯

అత్త భాగ్యనగరవార్త
లడిగి, పెరుగు వేయువేళ

ప్రస్తావన చేసె నతని
పరిణయప్రవృత్తిగూర్చి.
కొంచె మవల గదిలోపల
కూరుచున్న మీనాక్షీ
దేవి యాక్షణమ్మె నందు
తేరి చూచుచుండె నతని.

"ఇంక నేను స్వతంత్రముగ
నెచటనైన నుండవచ్చు.
కాని మహానగరమందె
కాపురంబు లాభకరము.

"ఇంతవరకు లేదు కాని
యిపు డిపుడే మనసు పెండ్లి
మీది కొరగుచున్న దనుచు
మీనాక్షిని జూచినాడు.

తృప్తితోడ లజ్జతోడ
దీపించెను కన్నెమోము.
జననియు గ్రహియించి వారి
వరణి మురిసిపోయె లోన.

౯

కరీంనగరు కరిగి మరల
గ్రామమునకు వచ్చినట్టి
భర్తతోడ బిడ్డపెండ్లి
ప్రస్తావన చేసె భార్య.

"పట్నగాన రకరకాల
పడతుల నీక్షించునట్టి
అందగాడు పురుషోత్తము
డమ్మాయిని పెండ్లాడునె?"

"మీ రెరుగరు కాని స్వామి,
మీనాక్షీ పురుషోత్తము
లన్యోన్యము ప్రీతిమగ్ను
లయినా రని నాకు దెలియు."

"పెండ్లి కింత త్వరయేటికి?
బిడ్డకు—ఏ కొరత లేదె?
పడసారము పదునాలుగు
వత్సరాలు నిండలేదు."

కర్మవిషయ మన్నమున్న
చాల బిగిసియున్న భర్త
మెత్తబడుట చూచి భార్య
మిక్కిలి సంతోషపడియె.

భారతీయచిత్రకలా
ప్రదర్శనము జరుగగలదు
నాల్గునెలల గడువులోన
నాగపురిని అనుచు దెలిపె

పత్రికలో ప్రకటనమ్మె
ప్రమోదమ్మె గూర్చ, కర్మ
పంప నెంచె శిల్పమూర్తి
ప్రదర్శనకు అవధిలోన.

వివరించుచు శిల్పకళను
విగ్రహంపు లక్ష్యముగా
మీనను కూర్చుండబెట్ట
మేనత్త ననుజ్ఞ వేడ

కొంత బెరుకుతోడ మీన
కూరుచుండె గాని, తొలుత
సిగ్గు పీడుకొలది నతడు
చెప్పె భంగి వహియించెను

"నీ ముఖమ్మె మీనాక్షీ,
నిండుదైన, ఇంచుకంత
దగ్గరదై కన్నుదోయి
తగ్గించెను సౌష్ఠవమ్మె"

అని కొలతలు తీసికొనుచు
అన్యమండలమున కతడు

## ఉ ప గూ హ న ము

ప్రారంభము చేసె నామె
ప్రతిరూపము మృత్తికతో.

నిర్మాణము ముగిసినంత
నీ భంగికి మెచ్చితినని
అతడు మీన చెక్కిళ్ళను
అలతిగ ముద్దాడినాడు

మీన బాహులతిక లతని
మెడకును పెనవేసి కనులు
మూసి యతని పెదవులపై
ముద్దుగొనియె దీర్ఘముగా.

ఎటనుండియో వచ్చినట్టి
యెనిమిదేండ్ల నారాయణ
సంభ్రమమున గాంచి, పోయి
జననితోడ జెప్పినాడు

"అక్కకు బావకును పెండ్లి
అగును రెండు నెలలలోనె,
భార్యాభర్తలు వారలు
పసివాడవు నీ కేటికి?"—

అనుచు తల్లి మందలించి,
ఆవల నేకాంతమందు
పుత్రికతో, నిన్న కాక
పోవనీకు బావ ననియె.

అన్యదృష్టి లేక కర్మ
అధికనిష్ఠతోన శిల్ప
నిర్మాణమునందు భూరి
నియుక్తాంతరంగు డయ్యె.

స్వచ్ఛచంద్రకాంతశిలా
శకల మతని టంకహతికి
అనుదినమ్ము రమ్యదేవ
తాకారము దాల్పసాగె.

శిల్పమూర్తి పరిసమాప్తి
చెందినపుడు మీనాక్షి
దేవి అక్కజంబుతోడ
దీని నామ మే మనియెను

నీ పేరే యనుచు నామె
నిద్దపు చెక్కిళ్ళమీద
ఒలికించుచు ముద్దు, లామె
నుపగూహన చేసినాడు

భద్రము కావించి మూర్తి,
"ప్రదర్శనమునందు నాకు
బహుమానము వచ్చునేని
ప్రణయినికే అర్పణంబు"—

అనుచు సరససూక్తు లాడి
ఆవల తద్విగ్రహమును
వ్యవధిలోన నాగపురికి
స్వయముగ గొనిపోయినాడు

ఆవల 'ఉషో దేవత కే'
అఖిలభారతీయ కళా
ప్రదర్శనమ్మునందు ప్రథమ
బహుమానం బిచ్చినారు.

స్వర్ణపతక మొకటి, రెండు
సహస్ర రూప్యముల ధనము
పురుషోత్తముడను శిల్పికి
పురస్కార మని తెలిసెను.

విశాలాంధ్రదేశమందు
విశ్రుత గోదావరితట
నికట మంథెనాగ్రహార
నివాసి యా శిల్పి యనిరి.

పత్రికలం దీ వార్తలు
పఠియించుచు మేనమామ

హర్షమొందె ప్రసిద్ధాంధ్రు
డల్లుడు కానున్నాడని.

"మేలమాడినాడ నాడు
మీనా, నీ తోడ ప్రతిమ
కుహూ దేవతాభిధాన
ముంచితి : వైదికుడ కదా!"

"నీకు పెండ్లి యెపుడు బావ!"
"నెలలలోనె యనుచు నతడు
ఉత్సుకత్వ మొంది యామె
నుపగూహన చేసినాడు.

"నీకు రొమ్ముబిగుతు లేదు,
నేత్రమ్ముల నందు లేదు,
ఉంచు నేని నీవు మీన,
ఉహూ దేవతాకృతివే!"

అనెడి శిల్పి వాక్కులలో
ననురాగము గ్రహియింపక
అవ్యక్తంబైన భీతి
నా ముద్దియ యులికిపడియె.

వివాహమ్ము చేయ మామ
వేగిరపడుచున్న, శర్మ
"త్వర యేటికి మామయ్యా,
తాళు డించుకంత" యనును.

ఎందులకో మీన యతని
యెదుట బడుటయైన గాని
మాటలాడుటైన గాని
మానుకొనియె నాటనుండి

శర్మకు సన్మానసభలు
జలసాలును మెండాయెను.
నడచుచుండె నిండుహర్ష
కల్లోలములో దినములు.

హాటకపతకమ్ము ద్రవ్య
మతని చేతి కందినపుడు
మేనమామ యింటి కరిగి
మీనాక్షీదేవి కతడు—

పెద్దవారు చూచుచుండ
ప్రీతితోడ సమర్పింప
యత్నింపగ పురుషోత్తము,
డామె నతని వారించెను.

తప్పు తప్పు స్వీకరించు
తల్లియని తల్లి పలుక
అలుక కన్య నివారింప
నప్రతిభుం డయ్యె శర్మ.

ఇది యంతయు గమనించుచు
ఎనిమిదేండ్ల నారాయణ
ఒక్కసారి పెద్దలగని
బిక్కమొగము వేసినాడు.

### ఉత్తరార్థము

౧

ఆవల నొక వారమునకు
హనుమకొండనుండి వారి
చుట్టాలు వివాహోత్సవ
శుభలేఖను బంపినారు

సంబరపడి మేనమామ
సకుటుంబముగా నచటికి
జనుకోరికతోడ చాల
సన్నాహము చేసినాడు.

అచట పెండ్లియైన పిదప
ఇచటను మన యింటిలోన
పెండ్లికి ఆ బంధుజనుల
పిలుతమనియె యజమానుడు.

## ఉ ప గూ హ న ము

మీనాక్షి దేవి ముఖము
మిక్కిలి లిప్పారె, కాని
శర్మవదనబింబ మందు
సంతోషపు చిన్నె లేదు.

హనుమకొండ కతని గూడ
నాహ్వానము చేసినారు
పెద్దవారు, కాని యతడు
భీష్మించిన యట్లుండెను.

ఎనిమిదేండ్ల నారాయణ
యీవల కాతనిని బిలిచి
అక్క నిన్ను పిలువ మన్న
దొక్కసారి యని చెప్పెను.

దరహాసముతోడ మీన
"తప్పక రావలెను బావ!
హనుమ కొండలోని పెండ్లి"
కని యాతని దేరిచూచె.

శర్మ క్రింది చూడ్కితోడ
సరే యనుచు శిరము ద్రిప్పి
పెండిలిపయనము కోసము
పెట్టెలు సవరించినాడు.

బావకూడ హనుమకొండ
బయలుదేరు చున్నాడని
నారాయణ చేసినాడు
నాట్యము సంతోషముతో.

వేడుకలను సంబరముల
విందులలో పాటలలో
గడిచిపోయె అయిదునాళ్ళు
క్షణప్రాయ దీర్ఘంబై.

మీరందరు రావలయును
మీనాక్షి వివాహమునకు
మా యింటికి త్వరలోనె
మంథ న్యాగ్రహారమునకు.

అనుచు మేనమామవారి
నాహ్వానము చేసి, అవల
శర్మముఖము విలోకించి
సంతృప్తిం జెందినాడు.

బంధు జనములో నొక్కరు
పాలంపేట శివాలయ
మచ్చటి రామప్ప చెరువు
నవశ్యముగ చూతు మనిరి.

శిల్పసార భూతమైన
శివాలయము, సరోవరము
నిష్ఫలములు చూడనట్టి
నేత్రము లన్నాడు శర్మ.

అవకాశము లభియింపక
అతడు పోయిచూడలేదు.
వివిధ శిల్ప చిత్రమ్ములు
వీక్షించెను పత్రికలో.

సమ్మతించి తెల్లవారు
జామునసే కొందరందు
బయలుదేరినారు పెద్ద
బస్సున పాలంపేటకు.

ఒక్కించుక ములుగులోన
ఉపాహార పానీయము
లారగించి, అక్రమముగ
చేరినారు పాలంపేట.

పాకకృత్యమునకు నచటి
బంగాళాయందు కొంద
రాగినారు, ఘనపురమున
కరిగినారు శర్మాదులు.

గణపవరము విశ్రుతముగుచు
ఘనపురముగ మారిపోయె.

అచట శిథిల మగుచున్న
ఆలయములు చూచినారు.

మెట్లు దిగడివేళ నొకట
మీనాక్షి పాదరక్ష
జారిపోవ, పడకుండగ
శర్మ నామె నాదుకొనియె.

తొమ్మిది దేవాలయాలు
నెమ్మదిగా వీక్షించుచు
మరలి వచ్చినారు వారు
మధ్యాహ్నము బంగళాకు.

భోజనములు చేసి పిదప
పురుషోత్తమ శర్మాదులు
ఆదిలోన తటాకమ్ము
నవలోకింపగ నేగిరి

జలాశయము విశాలమ్ము
సహజముగా నేర్పడినది
రాతితోడ కట్టకొంత
రామోజీ కట్టించెను.

ఒక్క ప్రక్క చిన్న లంక
యున్నది యా సరసులోన.
పాదపములు గోపజనము
పశుగణంబు కానవచ్చె.

అదిగదిగో మొసలి యనుచు
అరచినాడు నారాయణ
పులులిచ్చట తిరుగు ననుచును
పురుషోత్తమశర్మ పలికె

తటము మీది యాలయములు
తటము క్రింద పచ్చచేలు
పరిశీలన చేసి కొండ
ప్రక్కగ దిగ సాగినారు.

2

సవిధమునం బారుకాల్వ
జలములోన కాళ్లు కడిగి
శివాలయ ప్రాంగణమ్ము
చేరినారు శర్మాదులు.

అర్షశాఖవారు చుట్టు
నడవిని కొట్టించివేసి
మందిర సంరక్షణకై
మరమ్మతులు చేసినారు

అప్పటికిని మిగిలియున్న
వాలయమ్ములోని ప్రతిమలు
నియమిత దేశమ్ములందు
నిబద్ధములు కాక కొన్ని.
ప్రదక్షిణము చేసి శర్మ
ప్రథమమందు దేవళమున,
కానల సవిమర్శముగా
నవలోకింపంగ సాగె.

3

పెట్టియున్న దొక్కమూల
చెట్టు ప్రక్క గుట్ట వెనుక
కళలూరెడి చామర
గ్రాహిణీ విగ్రహమ్ము
మెరుగు లీను నల్లరాయి
మిగుల పేర్పుతోడ నెవరో
శిల్పి మలచి రమ్యముగా
చేసినాడు విగ్రహంబు.

మణిమేఖల నగ్నమూర్తి
మధ్యదేశమందు వెలయ,
సన్నని మంజీరమ్ములు
చరణయుగళియందు పొలుచు.
ఉరోజములు పీనమ్ములు
సముత్తుంగమ్ములు, కౌరము

## ఉపగూహనము

శిరసునందునుండి కాంచె
మీవలకును వ్రేలుచుండు

హస్తములను కంకణమ్ము
లంగదములు బాహువులను
తాటంకమ్ములు కర్ణ
ద్వయమున నొప్పారుచుండ.

కేతకీ సుమ నివహమ్ము
కేశబంధమందు, దనర
అంగుళీయ భూషితహా
హస్తమందు చామరమ్ము.

త్రిభంగిలో నిలచి యున్న
స్త్రీ మూర్తిని చూచిదూచి
ప్రతిరూపము కాగి తమ్ము
పైనాతడు విభయించెను.

ధనుర్హస్తకంబుబోలు
తచ్ఛిలా విగ్రహమ్ము
పెదవులపై వలతి ముద్దు
పెట్టుకొన్నవాడు శిల్పి

సుందర విగ్రహము నతడు
చూచి చూచి తనివితీర
ఉత్సుకుడై యొక్కసారి
ఉపగూహన మాచరించె.

ఏ మూలనో యొదిగియున్న
యెనిమిదేండ్ల నారాయణ
చూచినాడు శిల్పి చేయు
చుంబనోపగూహనముల.

సవ్వడి లేకుండ వచ్చి
శర్మ భుజము తట్టినాడు

చిరునగవున "అక్కతోడ
చెప్పెద"నని బెదరించెను.

ఉలికిపాటుతోడ శర్మ
ఉవ్వెత్తుగ లేచి, రెండు
చేతులు పట్టుకొని వాని
సిగ్గుతోడ బతిమాలెను.

నారాయణ చిరునగవున
"నన్ను కాదు మా అక్కను
బతిమాలెను పత్రములో
బయటపెట్ట రహస్యమును.

"ఆలస్యము కాకుండగ
అక్కను పెండ్లాడ వలెను.
పద, పోవుద" మనుచు వెంట
బావను గొని పోయినాడు.

ఏదో విగ్రహము వంక
వీక్షించెడి మీనతోడ
"అక్కా, నిను పెండ్లిజూడ
అరుదెంచెను బావ" యనియె.

చీ పో యని యా కన్నియ
చిన్నవాని మందలించె
ఎనిమిదేండ్ల నారాయణ
ఎగిరి గంతువేసి చనియె.

ఇటునటు వీక్షించి శర్మ
ఎవ్వరచట కానరామి
ఉల్లాసముతోడ కన్య
నుపగూహన మొనరించెను!

# తేలు కుట్టిన పాము

**'కొ ల క లూ రి'**

సూర్యుడు పడమట వాలిపోయాడు. చీకటి మెల్లగా చేతుల్ని భూమిమీద కప్పింది. చీకటి పరిపాలన ప్రారంభం.

లోతైనలోయ లోయకు రెండు ప్రక్కలా ఉన్నతమైన నల్లరాతి పర్వతాలు, ఆ పర్వతాలను కలుపుతూ రైలు బ్రిడ్జి. క్రింద భయంకరమైన లోయ.

చాలా దూరంలో కూత వేసిన రైలు ముందులైటు బ్రిడ్జిమీదపడిన మరుక్షణంలోనే రైలు బ్రిడ్జిమీదకు వచ్చింది.

బ్రిడ్జిచుట్టూ చీకటి దట్టంగా క్రమ్ముకుంది. ఇంజన్ ముందుభాగంలో లైటు వెలుగుతోంది. వెలుగు చీకటిని తరిమివేసింది. వెంటాడింది. దాటిపోయింది. మరుక్షణంలో లోతైన దట్టమైన చీకటి.

రైలు బ్రిడ్జిదాటి, కొండ శిఖరం విడిచిపెట్టి, ప్రక్కనున్న లోయలోని కొండను చుట్టుకొని మెలికలు తిరుగుతూ వెళుతోంది. లోయచుట్టూ చెట్లు పెరిగాయి. గుట్టమీదనించి ప్రక్కనున్న పచ్చిక తప్పుకుంటూ దిగిపోయే పాములాగా రైలు దిగిపోయింది.

రైలు బోగీలు అన్నీ చీకటిగా వున్నాయి. దాదాపు అన్నిపెట్టెలు నిశ్శబ్దంగా వున్నాయి. ఒక్కచోట మాత్రం సన్నగా వెలుగు. ఇంజను తరవాత మూడవ బోగీలో, మూడవ కంపార్టుమెంటులో లైటు.

అది మొదటిక్లాసు కంపార్టుమెంటు. తలుపుల్లో ఒకటి లాక్ చేసివుంది. మరొకటి బోల్టుచేయబడింది.

కంపార్టుమెంటులో రెండు లైట్లు వెలుగుతున్నాయి మూడు ఫానులు తిరుగుతున్నాయి. ఉన్నది మొత్తం ఆరు బెర్తులు. పైనమూడు. క్రింద మూడు. పైన ఏదో సామానుంది క్రింద ఎదురుగా రెండు బెర్తులు. ప్రక్కగా ఒక బెర్తు, మరోప్రక్క రెండు తలుపులకు క్రోసం. ప్రక్క బెర్తుమీద లెదర్ బేగ్, మరేవో వున్నాయి ఎదురు బెర్తుల్లో ఒకదానిమీద పుస్తకాలు, మరొకదానిమీద పడక.

పుస్తకాల బెర్తు దాదాపు కాళీగావుంది. ఉన్న చిన్నచిన్న పుస్తకాలు పత్రికలు ఫానుగాలికి మెల మెల్లగా డాన్స్‌చేస్తున్నాయి పడకమీద ఒక వ్యక్తి పడుకొనివున్నాడు. ఆరోగ్యమైనశరీరం వ్యాయామం చేసిన దేహం

కంపార్టుమెంటు ఒకప్రక్కగా బట్టలున్నాయి. అవి కాకీ బట్టలు వాటిక్రింద పెద్దసైజు బూటు లున్నాయి

లెదర్ బేగ్ పైన ఒక బెల్టువుంది. అలాంటి బెల్టు సాధారణంగా అందరూ వాడలేరు. అక్కడే మరొక్క హేట్ వుంది. చాలా ఖరీదైంది అంత కంటే వింతైంది. హేట్ ముందు నొసటిపైనవుండే భాగంలో ఏదో ప్రభుత్వం గుర్తులాంటి ముద్రవుంది. దానికి రెండువైపుల ఏదో అలంకరణవుంది.

వ్రేలాడుతున్న వస్త్రానికిముందు భాగంలో ఏవో మెడల్సు వున్నాయి. వాటిపైన ఏవో రంగు రంగుల రిబ్బన్లున్నాయి రంగు దారాల కలయికతో ఏదో తాడు వస్త్రానికి కుడిచేతి భుజందగ్గర చుట్టివుంది ఏవో అక్షరాలు కూడా భుజంపైన కుట్టబడి వున్నాయి

ఆ వ్యక్తి నిద్రపోతున్నాడు పైన లైట్లు వెలుగు తున్నాయి ప్రక్కనే ఫానులు తిరుగుతున్నాయి.

ఎదురుగావున్న బెర్తుమీద ఏవో పుస్తకాలు చెల్లా చెదురుగా పడివున్నాయి. గాలికి నృత్యం చేస్తున్నాయి.

లైట్లు వెలుగుతున్నాయి. వెలుతురు ప్రసరిస్తున్నాయి

ఫానులు తిరుగుతున్నాయి, గాలి పంచుతున్నాయి.

ఎదురు బెర్తుమీద పుస్తకాలు ఎగిరి పడుతున్నాయి. ఏదో పత్రిక అట్టమీది బొమ్మ స్పష్టంగా కనబడుతోంది.

దుప్పటి దూరంగా పారేశాడు. లైటు వేశాడు. లేచి కూర్చున్నాడు.

మళ్ళీ ప్రయత్నించాడు. పడుకున్నాడు. మరొక్క ప్రక్కకు తిరిగాడు ఇంకొక్క ప్రక్కకు తిరిగాడు వేరొక ప్రక్కకు తిరిగాడు నిద్రపట్టలేదు.

లేచాడు.

ఎదురు షెల్ఫుమీద చూస్తున్నాడు అక్కడేదో పత్రికలూ—పుస్తకాలూ చూశాడు తీసుకున్నాడు విడిచిపెట్టాడు మూలకు తలవేసి కళ్లు మూసుకున్నాడు. నిద్రపట్టలేదు.

నిద్రపట్టలేదు తృప్తికలగలేదు. కాని అతని ముఖంలో లేదు విసుగులేదు నిరాశ ఎంతో చీకాకు పడవలసిందిప్పుడే కాని అదేమీ లేదు ఏదో మధురమైన అనుభూతి కలిగినట్లు, ఏదో విచిత్రమైన విధి విధానం జరుగుతున్నట్లు, ఏదో ఖలత్తమైన ఆనందంయొక్క అగ్రస్థాయి అనుభవం ముఖంలో కనిపిస్తోంది

ఎదురు షెల్ఫుమీద కొన్ని, క్రింద కొన్ని పుస్తకాలూ, పత్రికలూ వున్నాయి. ఏదో పత్రికలు చూశాడు ఏదో పుస్తకాలు చూశాడు. ఏదో పత్రిక తీసుకొని చూచి అక్కడే పడేశాడు.

మరొక పత్రిక వుచ్చుకున్నాడు ఏదో సినిమా పత్రిక అన్నీ అనెబొమ్మలే.

తీసి చూస్తున్నాడు.

ఒకతార, నిక్కరు వేసుకొని బీచ్‌లో కూర్చుంది.

మరోతార, కుక్కను ముద్దుపెట్టుకొంటోంది.

పేజీలు త్రిప్పుతున్నాడు.

ఒక తార జీవితచరిత్ర సచిత్రంగా ఆ పత్రికలో వుంది. ఆ పేజీలోనే అతి కొత్తమాట ఎప్పుడో వ్రాశాడు. అతను అతని అభిమానతార కొన్ని బొమ్మ లున్నాయి భర్తతో బజారుకు పోతోంది పిల్లలకు అన్నం పెడుతోంది. పార్కులో కూర్చుంది. పడుకుని పుస్తకం చదువుతోంది. తల దువ్వుకుంటోంది. అందంగా అలంకరించుకొంది. బట్టలు మార్చుకొంటోంది. గుర్రంమీద కూర్చుంది. పాట పాడుతోంది. నృత్యం చేస్తోంది.

అతను చాలాసేపు చూశాడు.

పేజీలు తిప్పుతున్నాడు.

సినిమాతార, కత్తిపట్టుకొని కదలకుండా గుర్రం మీద కదనరంగానికి వెళుతోంది.

ఏదో సినిమాలో ప్రేయసీ ప్రియులమాటలు. ప్రథమ సమాగమం

రాణీరుద్ర సినిమాలో క్రొత్తతార

వందనాయిక పాత్రలు నిర్వహించిన ప్రసిద్ధ తార.

పత్రిక మూసి షెల్ఫుమీద పడేశాడు

మరొక్క పత్రిక వుచ్చుకొని, పడకమీదకు పోయి, పడుకుని, దుప్పటి కప్పుకొని చదవటం మొదలు పెట్టాడు పదినిమిషాలు చదివిన తరవాత ప్రక్కన పడేసి, దుప్పటితలదగ్గరకు లాక్కొని నిద్రపోయాడు

అప్పటిదాకా తలదగ్గర అందుని ఆనుకొనివున్న పుస్తకం జారి క్రిందపడింది.

పుస్తకం సైజులో చిన్నది. పేజీల విషయంలో పెద్దది.

అతను దుప్పటి తొలగించిచూశాడు. పుస్తకం పైకితీశాడు. అది చిన్న నోట్ బుక్. ముద్దుగా వుంది.

అట్టమీద పేరువుంది అది అతని పేరుకాదు పేరు అర్థంకావటంలేదు. ఏ భాషో తెలియదు

పుస్తకం తెరిచాడు అది డైరీ.

డైరీ ఒక్కసారిగా తెరిచాడు. పెన్సిల్ వున్నచోటు తెరుచుకుంది పేజీలు కుడివైపు ఏమీ వ్రాయలేదు ఎడంవైపు ఏదో వుంది. అది ప్రబంధ భాషలో వుంది. తెలుస్తోంది.

అది అతని ప్రయాణం విషయం. హెడ్ క్వార్టర్స్ నుంచి వ్యాస్తానికి బయలుదేరాడు. ప్రయాణం మూడుకోట్ల కాలనాడు మొదలు. మూడుకోట్ల కాలవరకు వుంటుంది.

డైరీ కుడివైపుకు తిప్పాడు. తెల్లకాగితాలు ఎడంవైపుకు తిప్పుతున్నాడు ఒక్కొక్కచోట చాలా చాలాసేపు చూడటం, మరికొన్నిచోట్ల వెంటనే తిప్పటం చేస్తున్నాడు

ఎడంవైపు డైరీపుటలు రెండో మూడో తిప్పాడు.

# తేలు కుట్టిన పాము

అది హెడ్ క్వార్టర్సునుంచి వ్రాసింది. తనకు కూడా సెలవు పిలుపు దొరికింది. వ్యవస్థలానికి బయలు దేరుతాడు

మళ్ళీ నాలుగుపుటలు తిప్పాడు.

ఆ పుటలో విషయం కొంచెం మాత్రమే కన బడింది పూర్తిగా కనబడకుండా త్రిప్పివేశాడు. అందులో విషయం.

ఏదో నిర్ణయం. హెడ్ క్వార్టర్స్కి పోవాలి. సెలవు తీసుకోవాలి. ఇంటికి వెళ్ళాలి. పెళ్ళి చేసు కోవాలి.

మరికొన్ని డైరీపుటలు తిప్పాడు

అక్కడ తారీఖు మొదట్లో ఎర్రసున్నాలు కూడా క్రమంగా పెద్దవి వున్నాయి.

పనిమీద పడుకున్న అతనిముఖంలో కొంచెం మార్పువచ్చింది. విశ్వాసం కలిగింది

అది తను చేసిన ఒక నేరం ఆ విషయం అధికా రులు తెలిసింది కాని అధికారయుతంగా తెలియలేదు చిక్కులు వచ్చాయి. ఆ కలుషితవిధానంలో రాశాడు అది తను ఓ స్త్రీ వెంటపడటం అది నిరాకరించటం

మరికొన్ని డైరీపుటల్ని తిప్పివేశాడు.

ఒకచోట పచ్చగీతలు డైరీపుటలో హెడ్డింగు క్రింద కూడా, తరుచుగా అండర్ లైన్లు చేయ బడ్డాయి

అతని ముఖంలో తృప్తి నృత్యం చేసింది. దాన్ని అతను చాలా సేపు మూసుకున్నాడు

అది తన హృదయం కోరిచేసిన పని దానిని అందరూ ఘనకార్యమన్నారు ఆఫీసరు లెంక ఇచ్చి సత్కరించాలనుకున్నారు ప్రభుత్వం, డబ్బు పెంచి గౌరవించాలనుకుంది అతను తన కర్తవ్యమేమిటో నిర్వ హించాలని వ్రాసుకున్నాడు.

మరి రెండుపుటలు తిప్పివేశాడు.

అక్కడొక పుటలో నిండుగా, దట్టంగావున్న చేతి వ్రాతలో కొంత విషయంవుంది

'ఈ నాడు నా జీవితం ధన్యం. మానవుడినైనం దుకు మాతృభూమికి చేయగలిగినంత చేశానని హృదయం ఆనందంతో పరవళ్ళు తొక్కుతోంది. వైరుల ఉనికి తెలుసుకున్నాను. స్థావరాలు కనిపెట్టాను!'

మరి నాలుగుపుటలు తిప్పాడు.

అది వైరులు యుద్ధం చేస్తున్న విషయం నిజం. వైరులు అనుకోని సమయాల్లో ఎక్కడినుంచోవచ్చి అకస్మాత్తుగా దాడి చేస్తున్నారు సైనికులు చాలామంది చనిపోతున్నారు. తన సైన్యంలో వాళ్ళుకూడా చని పోయారు.

మరికొన్ని పుటలు తిప్పాడు.

తను సైన్యంతో వైరులు పొంచివుంటున్న స్థలా నికి పంపబడ్డాడు.

మరికొన్ని పుటలు తిరగవేశాడు.

'నన్ను ఆ ప్రాంతానికి పంపితే బాగుంటుంది. ప్రభుత్వం సంతృప్తుండో లేదో పంపితే నా కృషి పాటవ్యాలమీద మరొక్కసారి విశ్వాసం కలగ వచ్చు'

డైరీ పుటలు తిరుగుతున్నాయి. మరికొన్ని తిరిగి పోయాయి కొన్ని చోట్ల ఎర్రగీతలు, కొన్ని చోట పచ్చగీతలు చాలా వున్నాయి డైరీలో చాలా గీతలు వున్నాయి ఎర్రగీతలకంటే డైరీలో పచ్చగీతలు ఎక్కువ

మరికొన్ని పుటలు తిప్పబడ్డాయి

ఒక పుటలో పుటకు సరిపడే పచ్చగీతలూ, ఎర్ర గీతలూ వున్నాయి. ఒక ఇంటూ మార్కు వుంది. దానికి నాలుగు మూలల్లో నాలుగు ప్లస్ మార్కులు వున్నాయి ఆ మార్కులన్నిటినీ చుట్టుతూ ఆ పైన ఒక పెద్ద సున్న వుంది

ఇంటూ మార్కు పచ్చగీతలు. ప్లస్ మార్కు ఎర్రగీతలు సున్నకు పచ్చగీతతో ఒక చుట్టు ఎర్ర గీతతో ఒక చుట్టు వున్నాయి సున్న ఎర్ర, పచ్చగీతల కలయిక.

దాని క్రింద ఒకే ఒక్క లైనులో ఏదో వరస వుంది ఆ వాక్యంలోని మొదటిమాట ఏ భాషలోనిదో తెలియదు. తర్వాత టూక్ కేర్ టూ వుంది. ఆ పైన మెనస్ వుంది దాని ప్రక్కనే చివరను ఆ కే మాట ఇంగ్లీషులో వ్రాయబడివుంది. ఈ వివరణమంతా మామూలు సిరాతోనే.

మరికొన్ని పుటలు తిరిగిపోయాయి. చిట్ట చివరి పేజీలో ఏదో చాలా వ్రాయబడి వుంది. అక్షరాలు చాలా చిన్నవిగా వున్నాయి.

డైరీ చివరి పేజీలో చిట్టచివరనే ఏదో వ్రాసుకున్నాడు

అది అతనికి డైరీ విషయంలోవున్న అలవాటు. డైరీ కొత్తది మొదలుపెట్టబోయేముందు, ముందటిదానిలో తన జీవిత చరిత్ర వ్రాసుకుంటాడు.

ఆ వాక్యం తరవాత చాలా వుంది. అది అతని సంగ్రహ జీవిత చరిత్ర.

# తేలుకుట్టిన పాము

పిస్టలు పట్టుకొని కూర్చున్నాడు. చుట్టూ చూశాడు. కిటికీలు తెరిచివున్నాయి. తలుపు వేసివుంది. బాత్ రూం తలుపు తెరిచివుంది లోపల లైటు వెలుగుతోంది. కంపార్టుమెంటులో లైటు వెలుగుతున్నాయి. ఫ్యాన్లు తిరుగుతున్నాయి.

మునుపటి శబ్దం మళ్ళీ వినబడింది మొదటిసారి కంటె కొంచెం పెద్దది.

ట్రిగ్గర్ నొక్కబోయాడు. ఎందువల్లో ఆగిపోయాడో తెలియదు గాని ట్రిగ్గరు నొక్కలేదు.

శబ్దం మళ్ళీ వినబడింది మునుపటికంటె బాగా పెద్దగా వినవచ్చింది. కొంచెం స్పష్టంగా వుంది. ఎవరో పిలుస్తున్నట్లుంది

ఈసారి ట్రిగ్గర్ నొక్కటానికి ప్రయత్నం చేయలేదు

మళ్ళీ అదే శబ్దం ఆ గొంతుక ఆడ గొంతుకలా వుంది

పిస్టలు దూరంగా పెట్టాడు. తలుపు తీయబోయాడు. మనుదిరిగి వచ్చాడు పిస్టలు పుచ్చుకున్నాడు తలుపు దగ్గరకు పోయాడు.

తలుపు తీయబోయాడు. పిస్టలు చేతిలో చూచుకున్నాడు తలుపు తీశాడు దూరంగా నిలబడ్డాడు

ఒక ఆకారం ప్రవేశించింది. సౌమ్యంగా మృదువుగా, హాయిగా వుంది

ముందడుగు వేయబోయాడు వెంటనే వెనక్కి తగ్గాడు రెండడుగులు వెనక్కి వేసి నిలబడ్డాడు.

అదే ఆకారం మెత్తగా, జాలిగా కనిపించింది.

అతను అక్కడే నిలబడ్డాడు

ఒక ఆడది లోపలికి వచ్చింది. వయస్సు ఇరవై నాలుగు వుండవచ్చు చంకలో ఒకపిల్ల వుంది ఆ పిల్లను ఆమె శరీరాన్ని కప్పుతూ ఒకగుడ్డ వుంది. ఆమె చేతుల్లో ఆ పిల్లను పట్టుకోవాల్సిన అవసరం లేదు.

కళ్ళలో ఏదో విషాదం. ఆ విషాదమే విషాదమైంది. ముఖం సౌమ్యంగా వున్నా చూస్తే జాలి కలుగుతుంది. ఏదో కథలు విన్నట్లు, హృదయాన్ని కలవర పెడతాయి కళలు పడతాయి

బట్టలు ఖరీదు లేనివి. కట్టు కుదిరిగ్గావుంది. ఆభరణాలు కట్టులో దాగిపోయి అందంగా వున్నాయి. ముఖం చంద్రబింబంగా ముద్దుగావుంది.

బొట్టు పెట్టుకోలేదు. మెళ్లో తాళిలేదు చేతులకు గాజులు లేవు. ఆమెది వ్యక్తిగా పన్నని శరీరం. కాని కొంచెం లావుగావుంది. తగినట్లు. చక్కని రూపం. ధనవంతురాలైన వీరవనం బట్టలు చిరిగి వున్నాయి జుట్టుకు నూనెలేదు కాని దువ్వుకొంది. మనిషిలో ఏదో విరక్తి, నిర్వేదం చెందినట్లు ముఖం వ్యక్తమౌతుంది.

లోపలికి వచ్చిన వెంటనే కాళ్లమీద పడింది. గట్టిగా పట్టుకుంది వదలలేదు.

క్షణంలో తమాయించుకొని దూరంగా జరిగి పిస్టలు వైపూ, ఆమెవైపూ చూస్తున్నాడు.

ఆమె అతనివైపు దీనంగా చూసింది పిల్లవైపు, తన చొక్కావైపూ చూపింది ముఖంలోకి చూస్తోంది.

అతను ఏదో అడిగాడు ఆమెకది అర్థం కాలేదు. అందుకనే జవాబు చెప్పలేదు. ఏదో కాగితం తీసి ఇచ్చింది.

తీసుకున్నాడు

ఆ కాగితంలో ఏదో ప్రింటుచేసిన విషయం వుంది. రెండురకాల ప్రింటు కనిపిస్తోంది. రెండు భాషలు ఒకటి ప్రపంచభాష మరొకటి ప్రాంతం భాష. ఆ ప్రాంతం భాష అతనికి తెలియదు ప్రపంచం భాషలోని విషయం చూస్తున్నాడు.

ఈ కాగితం తెచ్చిన మనిషి మూగది

ఆమెవైపు చూశాడు ఆమె నాలుక చూపింది. నాలుక మామూలుకంటే చాలా లావుగా వుంది. చుట్టేది

ఆమెని చూశాడు ఆమె అతన్ని చూచింది. ఆమె చివుళ్లో చేతివేళ్ళు పెట్టి నోరు త్రిప్పి, చేతివేళ్ళు నైటికేసి అటూ ఇటూ తిప్పింది

గౌరవమైన కుటుంబంలో పుట్టి పెరిగింది

ఆమెవైపు చూశాడు, ఆమెలో అభిజాత్యం యిప్పుడు లేదు. కాని అంతకంటే అద్భుతమైన ఏదో ఆకర్షణ ఆముఖంమీద మామూలుగా కనబడే తెరలవెనక అవ్యక్తంగా కదలాడుతోంది.

భర్త యుద్ధంలో చనిపోయాడు.

అతని కళ్ళలో ఏదో విచిత్రమైన భావ సంచలనం కలిగింది కొంచెంసేపటివరకు కంటిలో కాగితం చూడలేక పోయాడు.

యుద్ధం దెబ్బతో ఆమె నాశనమైంది. ఆస్తి పాస్తు లేవీ లేవు.

ఆమెకళ్ళు చూశాడు. ఆ నయనాలు సజలాలు.

ఇద్దరు పిల్లల్ని పోషించాలి. దిక్కులేని వాళ్ళు.

పిల్లవైపు తేరిపార చూశాడు. పిల్ల ఏడవటంలేదు.

ఏదో ఉత్సాహంతో మళ్ళీ లేచాడు. ఆమె దగ్గరగా పోయాడు. నిటారుగా నిలబడ్డాడు. ఆదేకధ్యానంతో ఆమెముఖంలోకి చూశాడు కళ్ళు మూసుకుంది వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి.

శరీరంలోని అన్ని అవయవాలను పరీక్షగా చూశాడు. తన్మయుడైపోయాడు.

ఆమెదగ్గరగా వీపు ప్రక్కగా, మునిగాళ్ళమీద మెల్లగా కూర్చున్నాడు.

ఆమె కదలకుండా నిద్రపోతోంది.

ఆమె రెండు భుజాలమీద చేతులు వేశాడు మెల్లగా పట్టుకున్నాడు. గట్టిగా నొక్కాడు.

ఆమె లేవలేదు. గాఢంగా నిద్రపోతోంది. బ్రహ్మాండమైన నిద్రాదేవి పరిష్వంగం

అతను క్రిందు మీదౌతున్నాడు. తన్ను తెలియటం లేదు. మునిగాళ్ళమీద నిలబడలేక పోయాడు. తూలాడు. ముందుకు పడిపోయాడు.

ఆమె లేచింది.

అతను తత్తరపోయి లేచాడు. దూరంగా నిలబడ్డాడు.

అతని కాళ్ళు పట్టుకుంది, బతిమాలుకుంది. బలవంతం చేయబద్దింది. మరొక్క స్టేషనులో దిగుతానంది.

ఏదో స్టేషన్లో రైలు ఆగింది.

లేచిపోయి బెర్తు మీద కూర్చున్నాడు. నిద్ర పట్టటం లేదు.

చెక్కిలి కింద చేయిపెట్టుకొని కదలకుండా కూర్చుంది. బైటికి చూస్తోంది. నిద్రపట్టక మాగి పోయింది

ఆమె వైపు చూశాడు. తలవంచుకుంది.

అతని వైపు చూచింది. కిటికీలోంచి చూస్తున్నాడు.

అతనామె వైపు చూశాడు. ఆమె అతని వైపు చూచింది. అతనేదో మాట్లాడబోయాడు. ఆమె ఏదో చెప్పబోయింది. పుస్తకం చూడాను ఇవ్వమని అడిగాడు.

పుస్తకం అట్టమీద హీరో హీరోయిన్లు ముద్దు పెట్టుకున్నారు. తన్ను తెలియని తమకం. పుస్తకం తెచ్చియిచ్చింది. పుచ్చుకున్నాడు.

అట్టమీద బొమ్మ చూస్తున్నాడు

అట మీద బొమ్మవైపూ, అతని ముఖం వైపూ ఆమె పరీక్ష చేస్తోంది.

తనముఖం చూస్తున్నాడని తెలుసుకున్న ఆమె కూర్చేందుకు పోతోంది

పైకి లేచాడు

నిటారుగా నిలబడి వుంది

కొంచెం కొంచెం కదిలాడు

కదలకుండా వుంది

దగ్గరగా పోయాడు

దూరంగా పోలేదు,

చేతులు మీద వేశాడు

కాదన లేదు.

బిగువుగా పట్టుకున్నాడు

వీలైనట్లు పట్టుకోనిచ్చింది.

ఎదురుగా తిప్పుకున్నాడు.

సునాయాసంగా తిరిగింది

భుజాలు గట్టిగా నొక్కాడు

పట్టుగా వూపాడు.

మెల్లగా మీదకు వ్రాలింది

మెత్తదిగా ముఖంలోకి చూశాడు,

ముఖం గులాబి పువ్వులాగా విచ్చుకుంది.

పట్టరాని తమకంతో ఆమెను పట్టుకొని పెదవుల దగ్గరకు మృదువుగా లాక్కున్నాడు.

అలవిగాని ఉత్సాహంతో, ముప్పిరిగొనే ఆనందంతో, పెదాలు అందించింది.

అతని వీపు ఆమె చేతి వత్తిడికి నలిగిపోయింది.

ఆమె పెదవు గంటు పడింది.

అతను విడిపెట్టాడు.

ఆమె పట్టు తప్పుకుంది.

బెర్తుమీద కూర్చున్నాడు

పాపదగ్గర కూర్చుంది.

ఏదో స్టేషనులో రైలు ఆగింది. రైలు ఆగినప్పుడు అతనేమీ చేయలేదు. ఆమె మరొక్క స్టేషనులో దిగుతానని బతిమాలలేదు రైలు సాగిపోతోంది.

ప్రక్క బెర్తుపై పుస్తకాలలో కొందు పుస్తకం పైకితీసింది. ఒక్కొక్క బొమ్మ రెండు మూడు నిమిషాలసేపు చూచింది ప్రతిబొమ్మకూ ఆమెలోంచి ఉత్సాహమూ, ఉద్వేగమూ పరవళ్ళుతొక్కుతోంది.

ఆమె కొందు పుస్తకం బొమ్మలు చూడటం అతను చూశాడు. సంతోషంతో ముఖం వికసింపజేసు

# సుప్తదీర్ఘిక

శ్రీ మల్లంపల్లి శరభయ్య

కొల నిమ్మోయి, కరణములను
నలుగుల తెరు వడఁచి యే ననాదిమ నిద్రా
జలముల నంచులు మోవఁగ
నిలువు నిలువు దాఁక లోన నింపితి దీనిన్.

వివృత కరణ సరణి శివః జగత్ప్రీత్యయ
మలినవారి నిగిడి కలఁగు నేమొ
కొలను, విమల కమల కుముద కందప్రతా
నాభిరామ జరర మని తలంచి,

చిరతమో జలౌఘ శిశిర తమ స్పర్శ
మునిఁగి యణఁగె కరణములు తమంత
ఈఁద తాఁకి గూటియెద పులుంగుల వోలె
నెగయరాక తెలివియెల్లలందు.

అలవియగునె! నాకు నస్వప్నమౌ నిద్ర
విరియు నొక్కొ కమలవీధి యందు!
లయ విధాయి రయ చలత్ జలభ్రములందు
వివృతవక్త్రి నక్ర విహృతులందు.

అరిగి యరిగి లోని కబ్జనాళాంతర
విపుల గర్భశయ్య విశ్రమింతు
అలమి యచట నన్ను నస్వప్నమౌ నిద్ర
విరియుగాక కమల విపిన మిందు.

# కారల్ మార్క్సు ఆర్థిక సిద్ధాంతాలు

శ్రీ బులుసు వెంకటసుబ్బారావు

నవీన సామ్యవాదసిద్ధాంతానికి మూలపురుషుడు కారల్ మార్క్సు అనే విషయం నిర్వివాదమైనది. ఈనాడు 'మేము సామ్యవాదులం, భారతదేశంలో సామ్యవాదం విశృంఖలవిహారం చేసినప్పుడే సర్వతోముఖాభివృద్ధి లభ్యం కాగలదు' అని పెద్దగా ఉపన్యసించేవారెందరో మార్క్సు ఆర్థికసిద్ధాంతాలను అసలు అవగాహన చేసుకునేందుకే ప్రయత్నించరు. 'కారల్ మార్క్సు సిద్ధాంతాలప్రకారం రష్యా అభివృద్ధి చెందింది అలాగే మనదేశంకూడా పొందుతుంది. కాబట్టి మీ ఓట్లు మాకే అని' గట్టిగా కేకలు పెట్టడం తప్పితే మరేమీ తెలియనివారు నేడు ఆంధ్రదేశంలో చాలామంది ఉన్నారు. మనం సామ్యవాదాన్ని బలపరిచేముందు కాని, లేక తూలనాడేముందు కాని మార్క్సు సిద్ధాంతాలను అసమం విహంగమదృష్టితోనైనా పరిశీలించడం అత్యవసరం

మార్క్సు బహుముఖప్రజ్ఞాధురీణుడు ఆయన ఒక గొప్ప తత్త్వవేత్త చరిత్రకారుడు సంఘసేవకుడు. ఆర్థికశాస్త్రజ్ఞుడు, రాజనీతిజ్ఞుడు, అఖండమైన తర్కప్రతిభ కలవాడు తనకు ముందుకల పెట్టుబడిదారీ, సామ్యవాదాల, ఆర్థికవిజ్ఞాన సంప్రదాయం అంతా పరిశీలించి, తన భావములతో సమ్మిళితంచేసి ఒక అపూర్వమయిన నూతనతత్త్వాన్ని ఆయన సృష్టింపగలిగాడు ఈతత్త్వం మహోత్తమమైనదని కాని దోషరహితమైనదని కాని ఎవరూ అనరు కాని అది ప్రదర్శించిన ప్రభావం అనల్పమైనది. సాంఘిక పురోభివృద్ధికి ఆయన ఒక నూతన పథకాన్ని తయారుచేసి తదాదరణకు ఎన్నో సలహాలు వెల్లడించారు అ పథకమే కమ్యూనిజం, సోషలిజం రూపాలను తాల్చిన సామ్యవాద స్వరూపం అతివిశాలమూ, కఠినమూ, అయిన ఆయనసిద్ధాంతం ఆయన అనుచరులచేత విమర్శకులచేతకూడ కొంతవరకు అపార్థం చేసికొనబడింది. ఈ ప్రణాళిక అంతా ఏదో పిచ్చితనం అని కొందరు విమర్శకుల అభిప్రాయం ఆయన శిష్యులు మార్క్సు సిద్ధాంతాలు అనేకవిధాలుగా అర్థంచేసికొని అనేక తెగలుగా విడిపోయారు.

మార్క్సుతత్త్వాన్ని పరిశీలించేముందు ఆయన జీవితవిశేషాలు ఒకసారి పరిశీలించి చూద్దాం జర్మన్ జాతీయులైన దంపతులకు మార్క్సు జన్మించాడు. ఈయన తల్లిదండ్రులు ఆతరవాత క్రైస్తవ మతావలంబకులయ్యారు. జర్మన్ విశ్వవిద్యాలయాలలో చదివి ఈయన ప్రఖ్యాత జర్మన్ తత్త్వవేత్తఅయిన హెగెల్ సిద్ధాంతాలు జీర్ణించుకొని తత్త్వశాస్త్రంలో డాక్టర్ పట్టా సంపాదించాడు తరువాత కొన్నాళ్లు ఒక పత్రికాసంపాదకుడుగా పనిచేశాడు ఈయన విప్లవాత్మకమైన రచనలవలన ఆ పత్రిక నాటి ప్రష్యన్ నియంతలచే అణగద్రొక్కబడింది ఆతరువాత తాను ప్రేమించిన జెన్నీ వాన్ వెస్ట్‌ఫేలన్ అనే జమీందారీ వంశానికి చెందిన యువతిని వివాహమాడి మార్క్సు పారిస్‌కు పయనమయ్యాడు.

పారిసునగరంలో ప్రౌఢన్ మున్నగు విప్లవాత్మక సామ్యవాద రచయితల సాంగత్యం ఈయనకు లభించింది వారితో ఎన్నో విషయాలు చర్చించి వారి వాదాలు ఖండించాడీయన. వారి సిద్ధాంతాలు, విధానాలుకూడ లోపభూయిష్టంగా కనిపించాయి మార్క్సుకు

ఆ సమయంలోనే మార్క్సుకు జీవితాంతము ఆప్తమిత్రుడుగా తోడునీడగా మెలిగిన ఫ్రెడరిక్ ఏంజెల్సుతో పరిచయం కలిగింది మాంఛెస్టరులో బట్టలమిల్లుల కధికారి, కోటీశ్వరుడు అయిన ఒక ఆసామికి పుత్రుడు ఏంజెల్సు పిమ్మట పత్రికలలో విప్లవాత్మకమైన వ్యాసాలు చూసి ప్రష్యాప్రభుత్వ నిరంకుశ దీర్ఘహస్తం మార్క్సును అణచివేయ యత్నించింది. మార్క్సు ఫ్రాన్సువదలి బెల్జియంలో స్థిరపడ్డాడు

పందొమ్మిదవ శతాబ్దంలో నాలుగవ దశాబ్దం చాలా విప్లవాత్మకమైనది 1848 లో ఫ్రాన్సులో చాలా అలకల్లోలాలు జరిగాయి లూయీ ఫిలిప్సు చక్రవర్తి పదవిచ్యుతుడయ్యాడు విప్లవజ్వాలలు జర్మనీఅంతటా అలముకున్నాయి దానికి తోడు నిరుద్యోగంతోను, వేతనాల తగ్గింపులతోను బాధపడుతున్న కార్మికులు తిరుగుబాటుకు సిద్ధమయ్యారు. అన్ని వర్గాలలోను ప్రభుత్వంమీద అవిశ్వాసం, అసంతృప్తి, ప్రబలాయి. "న్యాయసంఘము" అనే రహస్యమైన అంతర్జాతీయసంస్థ కార్మికులను కూడగట్టుకొని విప్లవానికి నాయకత్వం వహించడానికి పూనుకొన్నది. తన ఆశయాలు, విప్లవసిద్ధాంతాలు,

ద్రోయమని మార్క్స్ తన జీవితంలో ఎన్నడూ ఉప
దేశించలేదు. ఐతే ఆ పరిపక్వస్థితి వచ్చినతరువాత
అహింసాయుతంగా పెట్టుబడిదారీ విధానాన్ని తొల
గిద్దామంటే సాధ్యమయ్యే విషయం కాదని ఆయనయూహ
ఆ పరిస్థితులలో తరతరాలుగా దుర్దశలో ఉన్న కార్మిక
వర్గమంతా తిరుగుబాటుచేసి విప్లవంలో విజయాన్ని
సాధిస్తుంది. పెట్టుబడిదారీ విధానానికి ప్రారంభంలోనే
పతనం ఎన్నటికీ సంభవించదు దాని ఉచ్చస్థితి వచ్చిన
తరువాత దానివలన అన్నీ కష్టనష్టాలే కాని ఏమీ ఉప
కారం లేదని ప్రజలు తెలిసికొన్న తరువాతనే దానికి
పతనం సంభవిస్తుంది ఈవిధంగా పెట్టుబడిదారీ విధా
నపు పతనము, కార్మిక రాజ్యాంగవ్యవస్థ నిర్మాణము
చాలసహజంగా, పరిణామాత్మకంగా జరుగుతాయి

ఈ పరిస్థితులలో సామ్యవాద నాయకుల కర్త
వ్యం ఏమిటోకూడ మార్క్స్ ఉపదేశించాడు పీడిత
కార్మికవర్గానికి వారిబాధలకు హేతువేదో తెలిపి వారి
తిరుగుబాటుకు సర్వవిధాల చేయూతనొసగి వారికి తగు
సలహాలనివ్వడమే నాయకుల కర్తవ్యం

తన సిద్ధాంతాల శాస్త్రీయతను నిరూపించుకొన
డానికి అవి ఆచరింపబడితే ఏమిజరుగుతుందో ముంగు
గానే సూచించాడు కార్ల్ మార్క్స్ కార్మికులసంఖ్య
క్రమముగా పెరిగిపోవడం, పెట్టుబడినమంతా కొంతమంది
వ్యక్తులహస్తాలలో కేంద్రీకృతం కావడం ప్రథమంగా
జరుగుతుంది. కార్మిక వర్గానికి ("Proletariat")
పెట్టుబడిదారులకు మధ్య సంఘర్షణవృద్ధి అవుతుంది
ఈ సంఘర్షణలో కార్మికవర్గం రెండువిధాలుగా విజ
యాన్ని సాధించవచ్చును ఒకటి ప్రజాస్వామ్య పద్ధ
తులద్వారా ఎన్నికలలో గెలిచి అధికారాన్ని హస్త
గతం చేసికోవడం, రెండవది విప్లవాన్వితంగా పెట్టుబడి
దారులను సంహరించడం ప్రథమమార్గంద్వారా
విజయం ప్రజాస్వామ్య దేశాలలో జరగడానికి కొద్దిగా
అవకాశం ఉందని మార్క్స్ సూచించినప్పటికీ,
ఆ విధానంపైన ఆయనకు నమ్మకం లేదు

పెట్టుబడిదారీ వ్యవస్థ పరిపక్వమునందినకొలదీ
కార్మికవర్గమునకు కష్టనష్టాలు ఎక్కువౌతాయని
మార్క్స్ తెలియజేశాడు క్రమంగా పెట్టుబడిదారులు
అధికలాభాలనాశించి శ్రామికుల వేతనాలను తగ్గించి,
వారుచేయవలసిన పనిని కష్టతరం చేస్తారు. రానురాను
ఉత్పత్తి పెరిగిపోవడం, గిరాకీ తగ్గిపోవడం సంభ
విస్తుంది. తమవద్ద పెరిగిపోతూన్న పెట్టుబడినంతో
లాభాలకోసం తహతహలాడే ధనికులు ఏమిచేయాలో
తోచక ఈ విధానాన్ని అన్నిరంగాలకు వ్యాపింప
చేస్తారు. వ్యవసాయంలోకూడ ఈవిధానం ప్రబల
మౌతుంది భూమిఅంతా కొంతమంది పెట్టుబడిదారుల
వశమై తదితరులంతా కేవలం కార్మికులౌతారు. ఈ
రంగంలోకూడా పెట్టుబడి హెచ్చిన కొలదీ
లాభాలు తగ్గిపోతాయి ఈవిధంగా ఒకవంక
నిర్విరామంగా ప్రోగుపడుతున్న పెట్టు
బడి ధనం, తీవ్రంగా పడిపోతూన్న గిరాకీ
—నిరుద్యోగుల ఆర్తరవంలో తీవ్రసంచలనం కలి
గించే పాటుపోట్లు ఎక్కువై క్లిష్టపరిస్థితులకు దారి
తీస్తాయి కార్మికవర్గం సహనం పూర్తిగా కోల్పోయి
అఖండవిప్లవానికి ముందంజవేస్తుంది ఆ మహావిప్లవ
సంగ్రామరంగంలో పెట్టుబడిదారులు సంపూర్ణంగా
నాశనం చేయబడతారు అధికారం, ధనం, అన్నీ
కార్మికుని వశమౌతాయి ఈ విధంగా, తనలో అంత
రంగికమైన తీవ్రమైన దోషాలమూలంగానే పెట్టుబడి
దారీ వ్యవస్థ నాశనం పొందుతుంది అంతా
సహజ చారిత్రక పరిణామం దీనినెవరూ ఆపలేరు ఇదే
భవిష్యత్తునుగూర్చిన మార్క్స్ ఊహాచిత్రం

పెట్టుబడిదారీ విధాన వినాశనం, కార్మికపక్ష
విజయం సిద్ధించినతరువాత విశ్వశాంతి, మహాసౌఖ్యం—
ఇంకా ఏవేవో వాటంతటవే కలుగుతాయి అని అన
డమేకాని తత్సాధనకు ఏ నిర్దిష్టప్రణాళికను మార్క్స్
సూచింపలేదు ఆ స్థితిలో రాజ్యాంగాన్నిగూర్చి,
ప్రభుత్వాన్నిగూర్చి, ఆయన కొంతవరకే పేర్కొ
న్నాడు అప్పుడు కార్మికపక్ష కార్యనిర్వాహకవర్గమే
ప్రభుత్వంగా వ్యవహరింపకలదట. విరోధపక్షం సర్వ
నాశనమవడంవలన దీనికి సర్వనియంతృత్వాధికారాలు
వస్తాయి. దీనినే మార్క్స్ కార్మికపక్ష నియం
తృత్వము ("Dictatorship of the proletariat)
అని వ్యవహరించాడు కాని ఈ నియంతృత్వంకూడ
అట్టేకాలం ఉండదు సంపూర్ణమైన సామ్యవాద స్థితి
రాగానే ఈ రాజ్యాంగమంతా దానంతటదే సహ
జంగా అదృశ్యమౌతుంది. తిరిగి ప్రజలలో స్వేచ్ఛా
సమానత్వాలు, పరస్పర సహకారం తలెత్తుతాయి
వర్గవిభేదాలు, పరస్పర కలహాలు లేని ఆ కార్మిక మహా
వ్యవస్థలో మానవుడు సర్వసుఖాలననుభవిస్తాడు ఈ
విధమైన ఊహాచిత్రమే కాని ఒక విధమైన నిర్దిష్ట
ప్రణాళికను మార్క్స్ సూచింపలేదు సామ్యవాద
వ్యవస్థలో ధరల నిర్ణయం ఏ విధంగా జరుగుతుంది?
పెట్టుబడి ఏ రంగాలలో ఏ పద్ధతులలో ఉపయోగింప
బడుతుంది? ద్రవ్యోల్బణాది దుష్ఫలితాలు ఏ విధంగా
అదుపులో పెట్టబడతాయి? ద్రవ్యము, లాభములు
ఏ పరిమాణాలలో పంపకం చేయబడతాయి? అనే
ప్రశ్నలకు మార్క్స్ సమాధానాలు సూచింపనైనా లేదు.
అయితే ఆయన సిద్ధాంతాలవలన కార్మిక పక్షానికి
ఒక గొప్ప ఆధారం లభించింది. ఏ విధంగా వ్యవ
సాయ దారులకు ఫ్రెంచి ఫిజియోక్రాట్ ఆర్థిక విజ్ఞా

ములక్షణీ చేయాలని కొనసాగిందో, ఏ విధంగా పెట్టుబడి దారులకు సాంప్రదాయక ఆర్థిక శాస్త్రజ్ఞుల సిద్ధాంతాలు ప్రోత్సాహాన్ని కలుగజేశాయో, అట్టి విధంగానే కార్మిక పక్షానికి మార్క్స్ రచనలు అధిక బలాన్ని చేకూర్చాయి.

ఈ విధంగా మార్క్స్ ఆర్థిక శాస్త్ర సిద్ధాంతాలను సింహావలోకనం చేసుకొన్న పిదప తత్ప్రామాణికత్వాన్ని పరిశీలిద్దాం

ఏ ఆర్థిక సిద్ధాంతాలను ఆధారంగా చేసికొని మార్క్స్ శిష్యులు సామ్యవాద తత్వాన్ని విప్లవాత్మకంగా ప్రపంచ విస్తృతం చేయాలని నడుము కట్టుకున్నారో, ఆ తత్వంలోనే అతి ప్రాథమికమైన దోషా లుండడం గమనార్హం.

మార్క్స్ సగర్వంగా నిర్ధారించి అతి శాస్త్రీయమని చాటిన చారిత్రక పరిణామ వాదము అసత్యమైంది. ఆయన ఊహించినట్లు, పెట్టుబడిదారీ విధానం ఎంతో పరిపక్వస్థితినందిన అమెరికా సంయుక్త రాష్ట్రములవంటి దేశాలలో సహితం వ్యవసాయం పారిశ్రామికం చేయబడి కొద్దిమంది పెట్టుబడి దారుల హస్తాలలో భూమంతా కేంద్రీకరింప బడలేదు. పైగా, ఆయా దేశాలలో ప్రభుత్వాలు చేసిన భూసంస్కరణములవలన వ్యవసాయారంగంలో అనేక మార్పులు వచ్చాయి. భూమి కొలదిమంది పెట్టుబడి దారుల చేతులలో కేంద్రీకరింపబడటానికి మారుగా శాసనములవలన ఎంతగానో వికేంద్రీకరింపబడి చిన్న చిన్న రైతులకు ఆర్థిక పటుత్వం కలిగించింది. ఈవిధంగా జరగగలదని మార్క్స్ మేధాశక్తి ఊహాతీతమైంది.

పెట్టుబడిదారీ వ్యవస్థ పురోగమించినకొలదీ, కార్మికుల సంఖ్య అత్యంతాధికమై అన్ని వర్గాలను అధిగమిస్తుందని మార్క్స్ ఊహించాడు. కాని చరిత్ర గమనం దీనినికూడ అసత్యమునే నిరూపించింది. కాల క్రమాన వృత్తి విద్యల మూలంగాను, చిన్న చిన్న వర్తకములమూలంగాను, ఇతరమైన ఉపాధులమూలంగాను జీవనాన్ని సాగించేవారి సంఖ్య పెరుగుతోందే కాని దేశమంతా కార్మికులలో నిండిపోవటం లేదు.

కార్ల్ మార్క్స్ ఊహాచిత్రణంలో అన్నిటి కన్నా ముఖ్యమైన దోషము పెట్టుబడిదారీ వ్యవస్థ వృద్ధి చెందినకొద్దీ కార్మికుల కడగండ్లు అధికమౌతా యని మార్క్స్ చేసిన వర్ణనమంతా అతిశయోక్తి అని కొన్ని ఆధునిక పెట్టుబడిదారీదేశాలు నిరూపించాయి. బాగా వృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాల్లో మార్క్స్ చెప్పినట్లు వేతనాలు తగ్గిపోయి, కార్మికులంతా కడగండ్లపాలు కాలేదు. వారి జీవనప్రమాణాలు రోజు రోజుకీ పెరుగుతున్నాయి. అమెరికావంటి పరిపక్వ స్థితి నందిన పెట్టుబడిదారీ విధానము గల దేశాలలో స్వంతకార్లలో సుఖంగా తిరిగే కార్మికులను చూస్తే మార్క్స్ ఊహాచిత్రం ఎంత వాస్తవికతా రహితమైనదో తెలుస్తుంది.

ఇక మార్క్స్ పరిణామ సిద్ధాంతంలో మరొక ఘోరమైన అసత్యాంశం ఒకటి ఉన్నది—కార్మిక విప్లవం, బాగా పరిపక్వత నందిన పెట్టుబడిదారీ దేశములందే సంభవిస్తుందని ఆయన ఊహ. ఇదికూడా సత్యదూరమని చరిత్ర నిరూపించింది. పందొమ్మిది వందల పదిహేడవ సంవత్సరం నాటికి రష్యాగణంలో పెట్టుబడిదారీ విధానం అసలు ప్రారంభదశలో నయినా ఉందా అన్న విషయం సందేహాస్పదం. అలాగే విప్లవం నాటికి చైనాలో పారిశ్రామికాభివృద్ధి ఏ మాత్రం లేదు. ఈ దేశాలలో విప్లవాలను రాజకీయ విప్లవాలంటే కొంత సబబుగా ఉంటుంది! ఇంక అటు వంక బాగా పరిపక్వ స్థితిలోనికి వచ్చిన పెట్టుబడిదారీ వ్యవస్థలలో—ఉదాహరణకు అమెరికాలో అసలు సామ్యవాద మహావిప్లవ ప్రసక్తే లేదు!

ఈ దోషాల నటుంచి ఆర్థికశాస్త్ర విజ్ఞానిగా కారల్ మార్క్స్ స్థానం పరిశీలిద్దాం. కార్మికుల కష్టాలను చూచి అత్యాగ్రహంగా వ్రాసిన ఆయన విప్లవాత్మకమైన వ్యాసాలు, గ్రంథాలు, పటుతర రాజకీయ మహాప్రభంజనాలను సృష్టించాయి. ఆయన సిద్ధాంతాల నాధారంగా చేసికొని అనేక నూతన రాజకీయ పక్షాలు పైకివచ్చి చాలా అలజడి కలిగించాయి. అయితే ఈ విప్లవాలు ఆర్థికశాస్త్ర రంగంలో ఏమాత్రం నూతన వికాసాన్ని కలిగించ లేకపోయాయని తెలుపవచ్చును. సాంఘిక పరిణామ విజ్ఞానానికి మార్క్స్ సిద్ధాంతం ఒక అమూల్యమైన చేర్పు. అయి నప్పటికీ కేవలం ఆర్థికశాస్త్ర దృష్ట్యా దానికి అంత గొప్ప విలువ లేదు. మార్క్స్ ప్రతిపాదించిన మారకపు విలువల సిద్ధాంతం, వేతన సిద్ధాంతం—అన్నీ కూడా ప్రాచీన శాస్త్రజ్ఞులు చాలావరకు కూలంకషంగా చర్చించినవే కాని క్రొత్త వేమీ కాదు.

ఈ విధంగా నిష్పాక్షిక మయిన ఆర్థికశాస్త్ర దృష్టితో చూస్తే కార్ల్ మార్క్స్—కీన్సు, రికార్డో, మార్షల్ మొదలైన ఆర్థిక శాస్త్రవేత్తల తరహాకు చెందినఆర్థిక శాస్త్రవేత్త కాదని చెప్పవచ్చును.

# కుండలినీశక్తి: కొన్ని అనుభూతులు

శ్రీ వావిరెడ్డి పార్థసారధి

వర్షములు వెనుకపట్టి, శరదృతువు ప్రవేశించినది ప్రొద్దు వాలింది రవిమోహనరావుల చెప్పటం పూర్తయింది మామూలు ప్రకారము రామాలయంలో ధ్యానం చేసుకుంటున్నాను అంతా నిశ్శబ్దంగా ఉన్నది. హఠాత్తుగ, ఆకాశం వైపున ఫెళ్లున మెరిసింది! పెద్దగా ఉరిమి, పిడుగు పడబోతున్నట్లు మేఘములలో మెరిసినట్లుగా తీగ మెరుపు మెరిసింది! అది కళ్లు మూసికొన్నంత తీవ్రంగా వుంది! మెరుపు వెంట పిడుగుపడుతుందని భయంకలిగి, ఆ అపాయంనుండి పారిపోదామని లేచి నిలుచున్నాను నిలుచోవడంతోనే స్పృహ వచ్చింది. నేను ఉన్నది దేవాలయంలో పైన కప్పు ఉన్నది, అక్కడ ఆకాశమూ లేదు మేఘములూ లేవు మెరుపులూ లేవు! బైటకూడా ఆకాశం నిర్మలంగా ఉన్నది. నాకు కనుపించినది, అద్భుతంగా మేఘములలో మెరియు మెరుపే ఇదేమిటా అని భ్రమించుచున్నాను. దీనిని గురించి పెద్దలను అడిగి తెలుసుకున్నాను అనుభవజ్ఞులు వ్రాసిన గ్రంథములను పరిశోధించాను. ఇందువల్ల కొన్ని అనుభవములు కలిగినా, కొన్ని శాస్త్ర పత్త్రములు సేకరించకలిగాను జస్టిస్ వుడ్రఫ్ కుండలినీయోగము, ఉపనిషత్తులు, తంత్రశాస్త్రములు పురాణములు, శాస్త్రీయదృష్టితో పరిశీలించి గొప్పగ్రంథములు వ్రాశారు జ్ఞానదేవులు, రామకృష్ణపరమహంస, వివేకానందస్వామి, లెడ్ బీటరు, అనిబిసెంటు, అరవిందులు కుండలినీ శక్తిని స్వయంగా దర్శించి, వారి అనుభవాలు ప్రకటించారు ఇంకా అనేక భారతీయులు, పాశ్చాత్యులు కూడా ఇట్టి దర్శనములను పొంది, వాటిని ప్రపంచమునకు చెప్పారు ఈ నాటి సత్యాన్వేషకులైన శాస్త్రజ్ఞులకు పాఠకులకు ఉపయోగపడునని ఉద్దేశ్యంతో క్లుప్తంగా మనవి చేస్తాను.

వెన్నెముకను, యోగశాస్త్రంలో బ్రహ్మదండమని, మేరుదండమని, వీణాదండమని పిలుస్తారు వెన్నెముకలో, తామరకాడలో ఉన్నట్లు కాలువగా ఉన్నట్టి, సెంట్రల్ కెనాల్ అన్నది కాలువ ఉన్నది. వుడ్రఫ్ అది వాలీకుదారంవలె ఉన్నదని వ్రాశారు. దీనిని సుషుమ్నా నాడి అని అంటారు. వెన్నెముకను ఆధారం చేసుకుని కొన్ని చక్రము లున్నవి. ఎలక్ట్రిసిటీ తీగయందు, దీపపు బల్బు లున్నట్లు శామ్యయందు వున్నట్లు ఉన్నవి ఈ చక్రములను పద్మములని కూడా పిలుస్తారు చక్రములు చాలా సూక్ష్మమైనవి మానుష్యలోకములనుండి, శక్తులను గ్రహించి, ఇవి శరీరమునకు అందచేయుచుండును ప్రతిచక్రమునకు కొన్ని రేకులు, వర్ణములు బీజాక్షరములు శక్తులు, దేవతలు అక్షరములు, వాహనములు, ఆకారములు, తత్త్వములు వేరువేరుగా ఉన్నవి. వెన్నెముక మూలములో, మలమూత్ర స్థానముల మధ్య మూలాధారమనే చక్రమున్నది ఇది 4 రేకులు, పృథివీ తత్త్వము, గణేశదేవత, లంబీజము ఢాకినీ శక్తి, పసుపువర్ణము కలిగి ఉన్నది

జననేంద్రియందు స్వాధిష్ఠానమనే చక్రం ఉన్నది ఇది 6 దళములు, జలతత్త్వం బ్రహ్మదేవత, వంబీజం, రాకినీశక్తి, తెలుపువర్ణము కలిగి ఉన్నది

నాభియందు మణిపురమనే చక్రమున్నది ఇది 10 రేకులు, అగ్నితత్త్వం, రంబీజం, లాకినీశక్తి, విష్ణు దేవత, నీలవర్ణం కలిగివున్నది హృదయందు అనాహత చక్రం వున్నది ఇది 12 దళములు, వాయుతత్త్వం, ధూమ్రవర్ణం, యంబీజం, కాకినీశక్తి, శివుడు దేవతగా కలిగివున్నది

కంఠందగ్గ విశుద్ధచక్రం ఉన్నది ఇది 16 రేకులు, ఆకాశతత్త్వం, తెల్లరంగు, హంబీజం, శాకినీశక్తి, దుర్గాదేవత కలిగి ఉన్నది

భ్రూమధ్య ఆజ్ఞాచక్రమున్నది ఇది 2 దళములు, మనోతత్త్వం, ఓంబీజం, హాకినీశక్తి, అర్ధనారీదేవత కలిగి ఉన్నది శిరస్సుపైన, శిఖ (పిడి కట్టిన జుట్టుముడి) క్రింద సహస్రార పద్మం వున్నది ఇది వెయ్యి దళములు, అతీతతత్త్వము అవ్యక్త ప్రణవబీజం, కామేశ్వరీ కామేశ్వరులు దేవతలుగా కలిగి వున్నది

చక్రములలో దళములు మొదలైన వాటిలో కొన్ని అభిప్రాయభేదము లున్నవి యోగకుండలినీ ఉపనిషత్తులో అనాహత చక్రమునకు 16 దళములని, ధ్యానబిందూపనిషత్తు శాండిల్యోపనిషత్తులలో మణిపుర చక్రమునకు 12 రేకులున్నవని వ్రాశారు. స్వాధిష్ఠానచక్రము, నాభిప్రక్కగా, పైభాగమందున్న

# జీవితమాధుర్యం

శ్రీ మల్లాది సత్యనారాయణ

జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ప్రతి మానవునకు మంచి యోగాలు వస్తాయని అప్పుడే జాగ్రత్తగా ఆ మంచి యోగాల్ని సద్వినియోగం చేసుకున్నవాడే నేర్పరి అని అయితే ఆ మంచి యోగాలకోసం నిరీక్షణ ఓర్పు చాలా అవసరం అని గోపాలానికి తెలియకపోలేదు. అయితే కాలగర్భంలో కొన్ని సంవత్సరాలు కలిసిపోయి యిప్పుడు చూచినా గొప్పకు (?) తెత్తెకులోకి (?) అన్నట్లు యేడుస్తూ బాగుస్తూ (?) లేని తన జీవితాన్ని తలచుకుంటూంటే మంచి యోగాలు వస్తాయన్న నమ్మకం కాస్తా నశించింది గోపాలానికి నశించిపోవడమే కాకుండా ఆ మంచి యోగాలు అన్నపదం ఎవరినోట వింటేనా విషపడ్డట్లు (?) యేవగింపు (?) మంచి యోగాలు అనే ప్రశ్న వినపడేంటనే (?) వెలవెలలేది (?) కాని ఆ ప్రశ్నకు సమాధానం తనలోపలే అణగిపోయేది

సంవత్సరం పొడుగునా వాన అనక ఎండనక కొండనక, పురుగనక పుట్ట అనక, రెక్కలు ముక్కలు చేసుకుని పొలం పండించిన వానికి యెంత నిరీక్షించినా మంచి యోగాలు రావు భూమిగల భూమంచుకు (?) యెప్పుడూ మంచి యోగాలే వస్తూంటాయి పగలు పన్నెండుగంటలూ రక్తం ధారపోసి మిల్లులో పనిచేసే కార్మికుడు ఎంత నిరీక్షించినా యెంత ఓర్పు వహించినా మంచి యోగాలు రావు. మిల్లు యజమానికి మూడువందల అరవై నాలుగు (?) యోగాలూ మంచి యోగాలే

కష్టపడే వాడికి అనుభవించేది యింకొకడు అనే సిద్ధాంతం వేళ్ళుపాతుకు పోయిన మనదేశంలో అందరికీ మంచి యోగాలు యెప్పుడూ రావు కొందరికే వస్తూంటాయి అందుచే గోపాలానికి ఆ మంచి యోగాలు అన్నమాట వింటే హేళనగా ఉంటుంది.

సాహుకారు వెంకటసుబ్బయ్య యిచ్చిన అర్డరు ప్రకారం సగము కావడానికి (?) తెల్లవారుఝామునుండే బయలుదేరే నిమిత్తం సాహుకారిచ్చిన యేభైయేడు (?) రూపాయలు జాగ్రత్తగా జాకెట్ (?) సంచిలో భద్రపరచి నడుం చుట్టూ కట్టుకొని బయలుదేరి యింటికి వస్తున్న గోపాలానికి ప్రొద్దుటినుంచి తిండి లేనందున కళ్ళు తిరుగుతున్నాయి తన తిండిమాట దేవుడెరుగు. చంటిపిల్లకి ప్రొద్దుటినుంచి పాలు లేవు పాలడబ్బా నిన్ననే అయిపోయింది. ఈ సాయంత్రం పాలడబ్బా కొనుక్కు వెళ్ళకపోతే యీ రాత్రి పిల్లని పట్టుకోగలరా? పాలడబ్బామాట తలపునకు వచ్చేసరికి గుండె గుభేలుమంది. ఏం పెట్టికొంటాడు పాలడబ్బా వెలాఖరు (?) అయి ఒకటవ తేదీ వస్తే కాని సాహుకారు వెంకటసుబ్బయ్య జీతం యివ్వడు ఇద్దరు (?) అంటే సాహుకారు కదిపా (?) తప్పలేదు. ఎందుచేతనంటే గోపాలం సాహుకారు చుట్టూ పని యిప్పించమని తిరిగినప్పుడే సాహుకారు వెంకటసుబ్బయ్య కొన్ని షరతులు జాగ్రత్తగా విధించి గోపాలంచేత సంతకం చేయించుకున్నాడు. అప్పటికి ఆమోదించి ప్రవేశించాడు గోపాలం

నెలలో ముఖ్యగా (?) ఎప్పుడూ జీతం కొయ్యాడు (?) డబ్బులో కొంతకూడా అడగడానికి వీలులేదు నెలా పూర్తి అయ్యాక ఒకటవ తేదీని పూర్తిగా జీతం యిచ్చే వరకు మొదటిది

ఇక రెండవది గుమాస్తా సంఘాలలో చేరడం గాని సమ్మెలలో పాల్గొనడంగాని యెంతమాత్రం కూడదు

మూడవది ఇష్టం లేకపోతే పనిమానివేయడం తప్ప జీతం పెంచమని యెప్పుడూ అడగకూడదు

నాల్గవది సెలవు (?) కుదరాలు (?) అంటూ ఆదివారాలు పనిమానడానికి వీలులేదు ఎంత అత్యవసరమైన పని అయినా సావుకారు పర్మిషను తీసికొనిదే మానడానికి వీలులేదు.

ఐదవది పని యేమాత్రం తృప్తికరంగా లేకపోయినా గోపాలాన్ని పనిలోనుంచి తప్పించడానికి నోటీసులతో నిమిత్తం లేకుండా పూర్తిహక్కులు సావుకారుకున్నాయి.

ఆరవది నెల జీతం అరవై రూపాయలు అయినప్పటికీ సావుకారు అంకెలు యెంత యెక్కువగా వేసి సంతకం పెట్టమన్నా గోపాలం సంతకం పెట్టి తీరాలి.

ఇన్ని షరతుల కంగీకరించి ఉద్యోగంలో ప్రవేశించిన గోపాలం యీ రోజు యింట్లో బియ్యంలేక పస్తు పడుకోవలసి వచ్చినా చంటిపిల్లకు పాలడబ్బా లేపోయినా సావుకారుని యేమని అడుగుతాడు? కనీసం చెప్పేందుకూడా తన అసమర్థతను సూచిస్తుందని చెప్పలేదు.

## ఆచార్య శిశిరకుమార్ మిత్ర


శ్రీ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి




యిటీవల బ్రిటిష్ రాయల్ సొసైటీవారు యిద్దరు ప్రముఖ భారతీయ భౌతిక శాస్త్రవేత్తలను సభ్యులుగా యెన్నుకొని. వీరిలో ఒకరు ఆచార్య ఎస్. ఎన్. బోస్ వీరు చాలకాలము కలకత్తా విశ్వవిద్యాలయము ఆచార్యులుగానుండి, ప్రస్తుతము విశ్వభారతి శాంతినికేతనమునకు ఉపాధ్యక్షులుగానున్నారు రెండవ వారు ఆచార్య శిశిర కుమార్ మిత్ర.

శ్రీ శిశిర్ కుమార్ మిత్ర కలకత్తాలో 1890 లో జన్మించిరి భగల్పూర్ కళాశాలయందును, కలకత్తా ప్రెసిడెన్సీ కళాశాలలోను విద్య నభ్యసించిరి 1919 లో కలకత్తా విశ్వవిద్యాలయమువారు వీరికి D Sc. పట్టము నొసగిరి ఆ సంవత్సరములోనే వీరు పారిస్ విశ్వవిద్యాలయమునకేగెంచి 1923 లో స్వదేశమునకు తిరిగివచ్చిరి వెంటనే కలకత్తా విశ్వవిద్యాలయములో భౌతిక శాస్త్రములో ఖైరా ప్రొఫెసర్ గా నియమింపబడిరి నిస్తంత్రి ప్రసారము (వైర్లెస్ కమ్యూనికేషన్స్) దేశములో ముందు ముందు వేగముగ అభివృద్ధి పొందగలదని ఆచార్య మిత్ర ఆ రోజులలోనే గ్రహించి, వైర్ లెస్ శాస్త్రమును పెద్ద తరగతులలో బోధించుట మొదలిడిరి. అంతేకాక వారు ఆ శాస్త్రములో పరిశోధనలు కూడ మొదలిడిరి 1935 లో వారు సర్ రాష్ బిహారిఘోష్ ప్రొఫెసర్ గా నియమింపబడి, పదంబడి 1955 లో రిటైర్ అగునరకు ఆ పదవి యందే యుండిరి

భారత ప్రభుత్వమునకు చెందిన కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ యిండస్ట్రియల్ రిసర్చి వారిచే రేడియో పరిశోధన సంఘమును స్థాపింపచేయుటకు ఆచార్య మిత్ర కారకులు ఈ సంఘటనమునకు ప్రప్రథమ అధ్యక్షులుగా వీరు 1943-48లో పనిచేసిరి. వీరి కార్యకర్తృత్వమున కలకత్తా విశ్వవిద్యాలయములో 1949 లో రేడియో ఫిజిక్స్ అండ్ ఎలక్ట్రానిక్స్ శాఖ నెలకొల్పబడెను

ఆచార్య మిత్ర మనదేశములో రేడియోకు సంబంధించిన పరిశోధనలలో అగ్రగణ్యులు వారు యువకులకు, తమ శిష్యులకు ప్రోత్సాహము నిచ్చి సహాయము చేయుటలో ఉదారబుద్ధి కలవారు

వీరు Upper Atmosphere అను గ్రంథమును రచించిరి ఈ విషయమును గురించిన గ్రంథము యిది యొక్కటే యగుటయే గాక అనేక అంశములలో యిది స్వతంత్ర రచనగా ప్రపంచ ఖ్యాతినొందినది. యిటీవల దీనిని రష్యన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ వారు రష్యను భాషలోనికి తర్జుమా చేయించి ప్రచురించిరి

ఆచార్య మిత్ర 1955 లో భారత విజ్ఞాన పరిషత్తు (Indian Science congress) నకు అధ్యక్షత వహించిరి. భారత విజ్ఞాన వార్తాసంఘమునకు కూడా అధ్యక్షులు. ఈ సంఘమువారు "విజ్ఞానము-సంస్కృతి" (Science and Culture) అను యింగ్లీషు మాసపత్రికను ప్రచురించుచున్నారు అంతర్జాతీయ జియోఫిజికల్ ఇయర్ కొరకు భారత జాతీయసంఘమునకు ఆచార్య మిత్ర సభ్యులు అనేక భారతీయ, విదేశీయ వైజ్ఞానిక పత్రికాసంపాదక వర్గములలో సభ్యులు. మన దేశములో యిటువంటి ప్రఖ్యాతిగాంచిన శాస్త్రజ్ఞులుండుట మనందరికి గర్వకారణము.

